SREE

# :PARVATEE:

# PARINAYAM

(Telugu Drama in 5 Acts)

Prescribed for Madras University Vidwan 7. A. & 7. c. for both Preliminary and Final Examinations, 1943.
Vide F. St. George Gazette Date 5—3—40, Page 223.





*Author:*
A. V. KODANDAPANI SASTRI

# శ్రీ పార్వతీ పరిణయము

[ అయిదంకముల నాటకము ]







ప్రకృతము రేపల్లె హైస్కూలునం దాంధ్రపండితుఁడును, ఆంధ్రీకృత
భగవద్గీతాదికృతికర్తయు నగు బ్రహ్మశ్రీ అబ్బరాజు హనుమంత
రాయశర్మ పాకయాజిగారి ప్రథమపుత్రుఁడును, సంస్కృతాం
ధ్రాంగ్లభాషాపరిచితుఁడును నగు

## అబ్బరాజు వేంకటకోదండపాణిశాస్త్రిచే

రచియింపఁబడి
తజ్జనకునిచేఁ బ్రకటింపఁబడియె.


ప్రథమముద్రణము: 1,000 ప్రతులు.

బెజవాడ:
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపఁబడియె.

1935






[ వెల 12 అణాలు

# ఈ నాటకమున వచ్చు పాత్రలు.

## పురుషులు.

శివుఁడు—కథానాయకుఁడు
దక్షుఁడు—శివుని మొదటిమామ
నారదుఁడు—దేవఋషి
వశిష్ఠుఁడు—బ్రహ్మఋషి
వామదేవుఁడు—ఒక ఋషి
వీరభద్రుఁడు—శివుని కుమారుఁడు
ప్రతీహారి—సేవకుఁడు
బ్రాహ్మణులు—ఋత్విక్కులు
బ్రహ్మ—సృష్టికర్త
నారాయణుఁడు—పోషణకర్త
ఇంద్రుఁడు, యముఁడు, నిరృతి, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు, అగ్ని } దిక్పాలకులు
హిమవంతుఁడు—శివుని రెండవమామ
మన్మథుఁడు—విష్ణునికుమారుఁడు
చారుదేహుఁడు, మదనమిత్రుఁడు } ప్రాస్తావికులు.
వసంతుఁడు—హిమవంతుని చెలికాఁడు
తాతంభట్టు, శంకావధానులు } పెండ్లికిఁబోవు బ్రాహ్మణులు

## స్త్రీలు.

దాక్షాయణి—దక్షపుత్రిక, సతి—దాక్షాయణిపేరు } గౌరి లేక పార్వతి
మేనక—హిమవంతునిభార్య
రతి—మన్మథునిభార్య
పార్వతి—హిమవంతునికూతురు
చంద్రముఖి, పద్మనేత్రి } పార్వతిచెలికత్తెలు
లక్ష్మి—విష్ణునిభార్య
వాణి—బ్రహ్మభార్య
అరుంధతి—వశిష్ఠునిభార్య

# విషయసూచిక.

పుట

ప్రథమాంకము :



ద్వితీయాంకము :



తృతీయాంకము :

---

# INTRODUCTION

An introduction to a posthumous publication is always a sad enterprise—the more poignant, when it recalls scenes and situations in which the late author lived and moved and from which he was suddenly cut off by the hand of fate.

Late Mr. Kodandapani was yet but a lad of fifteen, a pupil of the 6th Form of my school, of comely looks, sweet manners, full of promise, very intelligent and industrious, the beloved of all his teachers. He was very healthy, too, with absolutely no sign of disease or weakness. However, in September 1933, he had an attack of fever, and what appeared to be an ordinary fever developed into a delirium in less than a week and carried him away.

The loss and grief of the father, a pandit in the same school, cannot be sufficiently described. Nobody knew that the lad, though he had learnt the "Kavyams" in Sanskrit as well as Telugu by that time, could write poetry so early and so easily and well. When the father found this souvenir of an attempt at writing Telugu poetry among the books of his late son, it was enough to burst his heart and no amount of condolence could avail. His only consolation lay in bringing out this issue, this 'POUTRI' by his late son, such as it is, and for what it is worth.

A drama in five acts, celebrating the marriage of Parvati and Parameswar, the Holy Parents of the Universe, was a natural attraction to the budding poet. A Smartha Saivite by birth, it was quite in the fitness of things that he began—and alas! ended—his authorship with a dramatic rendering of the mythology pertaining to his household Deities.

Without extravagance of thought or expression and without the shocking exaggerations that youth is commonly prone to, the story is narrated in the five acts comprising of 14 scenes. More than a hundred verses appropriately intermingle with prose pieces; and the style

of the whole poem is simple and faultless and deserves much praise. Both the prose and verse show what perfect models the poet could reproduce and what abilities were unfolding in him. A specimen of the poet's skill in dramatic dialogue can be had in Act II, Sc. 3. His attempts at humour appear in the opening of Act V. Sc. I. Characterisation, too, received his attention and the promise of better performance is quite evident.

As in the case of Keats and Shelley of English poetry, it is an irreparable loss to Telugu Poetry that this nice bud did not endur e to blossom into full shape and fragrance. It will, however, be, I think, a source of inspiration to many a young reader to think and realise by reading this poem what achievement is possible for earnest and patient study under proper preceptors even from the days of one's childhood.

With the love of an old teacher who feels his late pupil through every page, I now commend this to the kind patronage of the Telugu-reading public.

Board High School,<br>KOLLUR,<br>10—5—1935.

K. HANUMANTA RAO,<br>M. A., L. T.,<br>Head Master.

ఓం

శ్రీమద్బాలాత్రిపురసుందరీపరదేవతాయై నమః

# పీఠిక

## గ్రంథమాతృక

శ్రీమత్పార్వతీపరమేశ్వరుల వైవాహికకథావిధాన మీచిన్ని దృశ్య ప్రబంధంబునందు నిబంధింపఁబడియున్నది. ఇందుఁ బెంపొందు గాథాసరళి గమనింపఁగ నీవస్తు వొక్కచోటినుండి గ్రహింపఁబడినట్లుండక, యేకవిపోకడలకును సరిపోక, స్వతంత్రముగఁ బురాణగాథను గైకొని తత్తదనుకూలపూర్వాపర సందర్భముల యథోచితముగ జోడించి యీనాటకవస్తునిర్మాణము కావింపఁబడినట్లు కనుపట్టుచున్నది. ఇయ్యది కాళిదాసుని కుమార సంభవముతోఁ గాని, బాణకవిచే రచింపఁబడిన పార్వతీపరిణయమను సంస్కృతనాటకముతోఁ గాని, నన్నెచోడుని తెలుఁగుకుమారసంభవముతోఁ గాని సన్నిహితబాంధవ్యము కలిగియున్నట్లంతగఁ గన్పింపదు. ఏదియెట్లున్నను దత్తత్కవుల యభిప్రాయము లేమి, వారి రచనలందుఁ గల సునిశితములగు మెలఁకువపోకడ లేమి యిందచ్చటచ్చట ముచ్చటింపఁబడినట్లు చదువరులే గుఱుతింపఁగలరు. ఈశ్వరునకు దక్షునకుఁ గల కలహకారణము మొదలుకొని దక్షాధ్వరధ్వంసపర్యంతము నడచిన గాథాసంవిధానమును బార్వతీపరిణయము వ్రాసినట్టి పైకవు లెవ్వరును గ్రహించియుండలేదు. కాళిదాసుని ఫలోదయ సర్గలోని సల్లాపరసము కొంతకొంతవట్టుకు నీరచనలోఁ జూపట్టుచున్నది. చూడంజూడ నీబాలకవిని బ్రోత్సహించినది కాళిదాసుని పార్వతీపరిణయ గాథయై యుండవచ్చును. కాని యీచిన్నవాఁ డొక్కనాఁ డెవ్వరో పార్వతీపరిణయకథను యక్షగాన కాలక్షేపముగ విన్పించుచుండ దానిని వినివచ్చెననియు నచ్చటి హరికథాకాలక్షేపములోని సందర్భములఁ గైకొని యీ వస్తురచనకుఁ గడంగియుండనోపుననియు వీరితండ్రిగా రూహించు

చున్నారు. ఇయ్యది కొంతమేరకు సత్యమే కావచ్చును. కాని యీ బాలకవిభాస్కరుఁడు తూరుపుదిక్కునందే యస్తమించుటంజేసి మన యూహాలన్నియు నపోహలై పోవలసివచ్చెనే యని విచారమగుచున్నది.

# కవిప్రశంస

ఈ నాటకము రచించిన కవి కీర్తిశేషుఁడైన యబ్బరాజు వేంకట కోదండపాణిశాస్త్రి యను పదారేండ్లవయసుగల బాలచంద్రుఁడు. వీరు ప్రశస్త కవికుటుంబమునకుఁ జెందినవారు; కృష్ణ యజుర్వేదులు; తైత్తరీయశాఖలోనివారు; కవిత్వమునకుఁ బేర్వడిన యార్వేల నియోగిబ్రాహ్మణులు. మాఘపురాణాదిగ్రంథకర్తలగు శేషాచలామాత్యకవివరేణ్యులు వీరికిఁ బితామహులు. శ్రోత్రియులు షట్కర్మ నిరతులు, కవికులభూషణులగు హనుమంతరాయశర్మ పాకయాజిగారు వీరికిఁ దండ్రి. వీరితల్లి పేరు శ్రీ వేంకటసుబ్బాంబగారు. వీరే జ్యేష్ఠపుత్రులు. వీరి తమ్ములు (1) సారంగపాణిశాస్త్రి (2) బాలాంజనేయశాస్త్రి యని యిద్దరు గలరు. వీరియక్కగార్లు (1) వేంకటసీతారామాంబ. (2) వేంకటశివకామసుందరి. వీరికిఁ జెల్లెండ్రు (1) రంగనాయకి (2) సరస్వతి (3) గాయత్రి యను ముర్వురుమాత్రము కలరు. వీరు పిన్ననాఁటనె చక్కని సాహిత్యముగడించి కవితాపాటవము నలవఱచుకొని కనకంబు పదార్వన్నెలతోఁ బరిపూర్ణత నెందినట్లు వీరుగూడఁ బదారేండ్లకే సర్వకళా పరిపూర్తిఁగాంచి యీ నాటికచేఁ దనపేరు ధరపై నిలిపికొని కీర్తి మాత్రశరీరులైరి. వీరు విద్వాన్ బిరుదములోని ప్రథమ పరీక్ష యందుత్తీర్ణులై యాంగ్లవిద్యను స్కూలుఫైనలుక్లాసువఱకుఁ జదివిరి. గ్రంథము నామూలాగ్రముఁ జదివితిమేని మున్ముందుఁ బెరిగిన కొలందియు వీరు తమ కవిత్వమున కెన్నియో చిన్నెల వన్నెలఁ దీర్చి దిద్దఁగలట్టికళాశేముషీబీజములుఁ, దల్లక్షణము లింద నేకములుగఁ బొడగట్టుచున్నవి. కాని వీరి కాయువొసంగక యాచీకుముసలిబమ్మ తన వేదజడత్వమును జాటుకొనియున్నాఁడు.

# కృతిప్రతిజ్ఞ

ఈ బాలకవి తన కృతివిషయమై సూత్రధారునినోట వర్ణించుచుఁ దాను—

"(1) నవరసాలంకరణములతో (2) నవ్య క
ల్పనలతో మిగులఁ జెలంగునట్లు
(3) నూతనశబ్దసంజాతసంపదలతో
సర్వసమ్మతమై యొసంగునట్లు
పార్వతీపరిణయభవ్యనాటకరాజ
మును రచించితి."

నని స్వయముగఁ బ్రకటించియున్నాఁడు. ఈ నాటకమును సునిశితదృష్టితోఁ బరిశీలించినచో మన బాలకవి తా నొనర్చిన ప్రతిన మేరకు వీసముగాని లేక యరవీసముగాని బీరువోకుండ నిరాఘాటముగ సాధించుకొన్నట్లు విశదమగును. దానంజేసి యీ పైఁజెప్పఁబడిన నవరసములు నవ్యకల్పనములు నూతనశబ్దములు గ్రంథమునం దెంతవఱకు సంతరింపఁబడియున్నవో, కవి తన ప్రతిజ్ఞ నెంతవఱకు నెగ్గించుకొనఁ గలిగెనో శాఖాచంద్రన్యాయముగ నాశక్తికొలఁది నిరూపించెదను.

# నవరసములు

కావ్యలక్షణముల నిర్వచించునప్పుడు సాహిత్యదర్పణ గ్రంథకర్త "వాక్యం రసాత్మకం కావ్య" మ్మని ప్రకటించి యున్నాఁడు. రసములు తొలుదొల్త నెనిమిదిమాత్రమే యుండెను.

శృంగారహాస్యకరుణా వీరరౌద్రభయానకాః,
బీభత్సాద్భుతసంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః.

ఇట్లు రసంబు లెనిమిది యగుచుండఁ గావ్యప్రకాశమునందుఁ దొమ్మిదవ రసమును "శాంతోఽపి నవమో రసః" యని చేర్చియున్నాఁడు. దానంజేసి నవరసము లేర్పడినను బదియవరసము వత్సలమని కొందఱు వక్కాణించుచున్నారు. కాని నవరసప్రతీతి ప్రాయికముగఁ బరంపరాప్రాప్తమై వచ్చునది. ఇట్లుండఁ గొన్నియెడల రసబాహుళ్యము సంక్షిప్తముఁ గావించి "ఏకో రస" యనుచు నయ్యది

కరుణరసమని చెప్పుచున్నారు. నవరససంఖ్యావివాదము నటుండనిచ్చి ప్రస్తుతము ననుసరించెదను.

ఈ బాలకవి వస్తునిర్మాణావసరమున నవరస సంపాదనయందుఁ దదేకనిష్ఠతోఁ బురాణగాథలోని తత్తద్రసానుకూలంబు లగునట్టి పూర్వాపరసందర్భముల మేళవించియున్నాఁడు. నవరసస్ఫోరకంబు లగునట్టి కథాఘట్టములనే స్వీకరించుచు నయ్యెయెడల నాయారసములఁ జక్కఁగఁ బోషించి యున్నట్లు స్థూలదృష్టికే గోచర మగుచున్నది. ఇట్లు రసాన్వేషణముఁ గావించి తదనుగుణములగు రంగముల నిర్మించికొని తొమ్మిదిరసముల నొక్కమ్మడి నొక్కవస్తువునం దేరి కోరి జోడించుటకు యత్నించి యట్లే కావించి చివరకుఁ బోయి వెనుకకుఁ బారఁజూచుకొని యెనిమిదిరసములు మాత్రమే యిమిడ్చిన ట్లెఱింగి హాస్యమున కెడముఁ గానకయు, నవరసములు లోటువడకుండను రచించుటకుఁ గాబోలు నీబాలకవి, తాతంభట్టు వెంకావధానుల గోలతో నీకొఱవడిన హాస్యరసమును సైతము బూరించి నాటకమునకు నవరసస్ఫూర్తిని సమకూర్చినట్లు తోఁచుచున్నది.

దాక్షాయణీశంకరుల కైలాస విహారము, శివమోహాంధకారము, రతీమన్మథుల కేళీవన సంచారము శృంగార రసోత్పాదనకొఱకును; వీరభద్రావిర్భావము, మన్మథపరాక్రమము వీరరసపుష్టికొఱకును; దక్షాధ్వరధ్వంసము, సతీదేవతాగ్ని ప్రవేశము బీభత్స రసోత్పత్తికొఱకును; రుద్రుని క్రోధము, వీరభద్రుని కోపము రౌద్రరసనిర్వాహణముకొఱకును గొని తెచ్చుచు నసమనేత్ర విజృంభణమునం దద్భుతరసమును, మారమారణమునందు భయానకరసమును, రతీదేవికి పతిభిక్ష నిచ్చుటయందుఁ గరుణరసమును, పార్వతీపరమేశ్వరులతపోవనములందు శాంతమును, తాతంభట్టుగారి ధప్పళములతో హాస్యరసమును గడు ముచ్చటగ నాయా సందర్భములందుఁ దత్తద్రస నిష్పాదన కనుకూలముగఁ బద్యగద్యముల వ్రాయుచు నీనాటకమును జాగరూకతమై నిర్మించియున్నాఁడు. ఈదృశరసపోషణమును వేర్వేఱుగ నిరూపించుటకు మనసువడియు గ్రంథవిస్తరభీతిచే వదలివేసి మచ్చున కిచ్చుట రెండు పద్యము లుదాహరించెదను—

## రౌద్రరసము.

ఓరీ! సర్వజగన్నియామకుని ధీరోదాత్తునిం జిత్కళా
పారావారుని సంగవర్జితుఁ గృపాపారీణు గౌరీధవున్
గారల్ప్రేలి శపించి వచ్చిన మహాకష్టాత్మ! నీ కంఠమున్
ఘోరాసిం దునుమాడి గృద్ధలకు విందుల్ సేసెదన్ నిల్వరా.

(పుట – 18.)

## శృంగారరసము.

అనఁగుమోముచందమును నానును పెన్నెఱివేణిసోయగం
బానవపల్లవోష్ఠమును నాకనుఁదామరదోయి సొంపుపెం
పానెఱిదీపమేనుసొబ గామదదంతిసమానయానముల్
గానక యున్నవాని కిఁకఁ గామునిబాధలు మాన్పవచ్చునే.

(పుట – 62.)

తక్కుఁంగల రసము లందంద చదువరులు గుర్తింపఁగలరు గాన నీప్రసంగ మింతటితోఁ జాలించి "నవ్యకల్పనల" సంగతి విచారించెదను.

# నవ్యకల్పనలు

ఈ నాటక వస్తువునందు నవ్యకల్పన లున్నట్లు కవి తానే ప్రకటించికొనియున్నాఁడు. నిజమున కిం దట్టిచిత్రవిచిత్రకల్పనలెన్నెన్నియో కనఁబట్టుచున్నవి. మేము గుర్తింపఁగలిగినంతవఱకుఁ గొన్నింటి నిచ్చట వివరింతుము. దేవతలు తారకాసురుని చర్యలు ప్రకటించునప్పుడు ప్రతి దేవతచేతను దనక్షోభను వేఱ్వేఱుగ వర్ణింపించి క్రొత్త క్రొత్త కల్పనలను దత్సందర్భములందుఁ దత్తద్దేవతానుగుణ్యముగఁ జిత్రవిచిత్రముగఁ జిత్రించియున్నాఁడు. ఇటు చూడుఁడు—

## వాయుదేవుఁడు.

మెలమెల్లఁగను వీఁచినఁగ దనువునఁగ బెఱ స్వేదబిందుప్రజం
బులు నేఁగ బోవని కోపగించు నిఁక గాడ్పుల్ వీవఁ దత్పౌరకాం
తలమేనం బచరించుచందనపుఁబూఁతల్ రేఁగునంచు న్ననుఁగ
బలురీతుల్ కడగండ్లఁబెట్టి తనువుఁగ బాధించు లక్ష్మీశసుతా!

(పుట – 25, 26.)

ఇట్లుండ మన్మథుఁడు బాణప్రయోగ మొనర్చునప్పు డిది యా బాణము, నది యీ బాణ మనుచు బెదరించుచు వేఱ వేఱ బాణముల రుచుల వర్ణించుచున్న ఘట్టమునందు చక్కని క్రొత్తపోకడలు కన్పట్టు చున్నవి. ఈ పద్యమును దిలకింపుఁడు—

బాలమృణాలనాలముల బాళిని నేలెడి కేలుదోయితో
మేలిమిపాలవెల్లిమిసిమిన్ దలఁ దన్నినమేనికాంతితో
బాలమరాళయానమున భాసిలులక్ష్మిని నక్కునేర్పఁగాఁ
గే లిటు సాచఁజేసి హరి గెల్చిన దీపుపుతూపు నమ్ముమీ.

(పుట – 56.)

రతీదేవి తానుగూడ తపోవనమునకు వచ్చెద ననుచు, నరకాసు రునివధకుఁ బూర్వము సత్యభామ శ్రీకృష్ణునితోఁ బెనఁగులాడినట్టిభాగ వతఘట్టమునె మనమునం దిడికొనుచు నచ్చటిపోకడలనే యనుసరించుచు నూతనమగు కల్పన నొక్కదానిని గావించి యున్నాఁడు. ఇట్టులనే నవ్యకల్పనాద్యోతకంబులగు కథాఘట్టములే యనేకము లందంద కనఁ బడుచున్నవి. ఇట్టి సందర్భములు గాథాప్రణాళిక నభివృద్ధి నొందించు టకే గాక మిక్కిలి హృదయంగమంబైన పోకడ లలవడియుండుటచేత రసపుష్టికారకము లగుచున్నవి. ఇంతియగాక కవి - కల్పన - కావ్యము లను లక్షణవాచక శబ్దముల నన్వర్థములఁ గావించుచున్నవి. ఈ బాల కవి తా నీ ప్రతిజ్ఞనుకూడ జక్కఁగ నిర్వహించి యున్నట్లు చదువరు లూహింపఁగలరు. గ్రంథబాహుళ్య మేర్పడునను భీతితో మే మింత వఱకు స్థాలీపులాక న్యాయముగ వివరించి వదలివేసితిమి గాన చదు వరులు మమ్ముమ్మల మన్నింతురుగాక.

## నూతనశబ్దములు

ఈ వస్తువునందు "నూతనశబ్ద సంజాతసంపద"లున్నట్లు నిర్దే శింపఁబడినది. తదనుగుణముగ నిం దనేకములగు క్రొత్తశబ్దములు కను పట్టుచునే యున్నవి. ఆముక్తమాల్యదకర్తకుఁ బ్రియంబగు "ఝూట" మను పదము నీకవిగూడఁ బ్రయోగించియున్నాఁడు. "జటాజూటకేశ ఝూట"మన్నప్పుడు సమూహార్థకము ద్యోతక మగుటలేదు. వ్యష్టిశక

లార్థము తోఁచుచున్నది. కావునఁ గేశరఘాంట మన్నప్పు డొక్కపిల్ల జడ యని శబ్దార్థమును జెప్పినచోఁ జక్కఁగ సమన్వయించును. ఇట్టి వియే కొన్ని క్రొత్తపదములు నాటకమునం దెల్లెడల వెదఁజల్లింపఁబడి నవి. కొన్నింటి నిచట వ్రాసి చూపించెదను. 'గోచిపాత - గోడు గుడుపు - ఉసురుకొట్టు - కాఁబట్టియుండు - గొంతెమ్మకోరికలు - కీలా భీలము - పుచ్చినవక్క - మొదలగు చక్కని దేశ్యములు మాండలిక ప్రయోగము లిందు బాలకవి విరివిగ నచ్చటచ్చటఁ బ్రయోగించి యున్నాఁడు.

ఇట్టులనే పలుచోటులందు ముచ్చటలుగొల్పు చమత్కార వాక్యములు విచ్చలవిడిగ నుపయోగింపఁబడుటచే నిట్టి రచనలు కావ్య మున కొక నూతనం బగు సొబగు నొసంగుచున్నవి.

| | | |
|---|---|---|
| అయమ్యతనయవే యనిపించితివి | పుట | **13** |
| పూర్వదేవోత్తములు | ,, | **23** |
| వాసవ ! నీవ నా కిడెడివాఁడవు? | ,, | **24** |
| మాకడవాఁడవే గాని కడవాఁడవే | ,, | **47** |
| మును కైపడి కైపడి మీరి వైతు | ,, | **55** |
| మేనయత్తమగఁడు మేనమామ కాఁడు | ,, | **58** |

ఈ బాలకవిచంద్రుఁడు శబ్దాలంకారములం దపరిమితాసక్తి కల వాఁడని కేవలమగు స్థూలదృష్టి కే స్ఫురింపఁగలదు. నాటకరచనయం దెల్ల యెడల నుల్లమును బల్లవింపఁజేయు చక్కని యమకములును బదముల పొందికయును గుప్పలు తెప్పలుగఁ దేలియాడుచున్నవి. ఇట్టి పద్యములు, వాక్యములు నిచ్చట కొన్ని తెచ్చి చూపించెదను.

| | |
|---|---|
| పొత్తంపుబిత్తరి నిత్తరి నత్తెల్లవేల్పుకేల హత్తించుటెంత? | పుట – 3. |
| దండ మిదిగో గొనుము దండఁజేరిన నన్ను. | పుట – 5. |
| నాదు హితుండై నాదుహితం బెండ్లియాడి...సతంబును హితంబునఁ బొల్చుచు | పుట – 6. |
| గోరితో పిశాచనిశాచరనాథు నక్కటా. | పుట – 34. |
| ఇంక నావంత నావంతయైన నొందలేదు. | పుట – 45. |

ఇట్టి వనేకములగు ప్రయోగము లిందుఁ గలవు. కొన్నిటి మాత్రమే యుదాహరించితిని.

# సామెతలు

ఈ బాలకవి నాటకమునం దంతటనుగూడ నుభయభాషల లోనంగల చక్కని నీతిబోధకములగు సామెతలను సారభూతములగు నాభాణములను సమయస్ఫూర్తిగ మేళవించియున్నాఁడు. సామెతలన్నచో నీకవికి మిక్కిలి ప్రియంబు లని చదువరు లూహింపఁగలరు. అట్టి వాక్యములఁ గొన్నింటి నిందుఁ బొందుపరచెదను.

(సంస్కృతము)

"సహసా విదధీత న క్రియామ్"

"కష్టే ఫలీ"

షడ్భాగం మనుజయత్నానాం సప్తమం దైవచింతనమ్
అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్.

(తెలుగు)

అందిన కేశంబులు నందకున్నఁ బాదంబులా?

ఓడలు బండ్లౌను బండ్లోడ లౌను

కుక్కతోకఁ బట్టి గోదావరి దాటుట

వసఁ ద్రావిన పిట్టవలె

గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు.

ఇంకను నిట్టి వనేకములు కలవు గాని గ్రంథవిస్తరభీతిచే నుదాహరింపమానితిమి.

ఇట్లు నవరసస్ఫోరకంబులగు కథాఘట్టముల ననేకముల నేరికోరి సంతరించికొని, క్రొత్త క్రొత్త కల్పనల నయ్యాయెడల రసానుగుణముగ నాటకవస్తువునం దిమిడ్చి నూతనపదములతో మేళవింపఁబడి మిక్కిలి చమత్కారమును బెంచుశబ్దాలంకారముల నెల్లెడ జల్లించి యీ బాలకవి తన ప్రతిజ్ఞను నల్లేరుపై బండివలె నిరాఘాటముగ కొనసాగించుకొనియున్నాఁడు. ఇయ్యది ప్రశంసార్హ మనకతప్పదు.

# నాటకధర్మనిర్వహణము

కావ్యములలో నాటకమునకును బ్రబంధమునకును జాల వ్యత్యాసము కలదు. ప్రబంధకవిత్వపాకములు, నాటక కవితాపద్ధతులు పృథక్స్వభావములు. ప్రబంధము శ్రావ్యము; నాటకము దృశ్యము. ప్రబంధకవిత కథానకసరణి ననుసరించును. నాటకకవిత్వ మన్ననో సల్లాపధోరణిలోఁ బ్రసరించుచు. కొన్ని పద్యములు ప్రబంధయోగ్యములై యుండవచ్చునేమో కాని రంగరంజకములు కాకపోవచ్చును. పద్యాంతములు సల్లాపసరణి ననుకరించి సంబోధన సంభాషణలతో సరసమై యుండవలెనేకాని యెడమొగములు పెడమొగములు పెట్టుకొని తెరలతోనో గోడలతోనో మాటాడుచున్నట్లున్నచో రసాభాస మగునేకాని రసావాసము కాఁజాలదు. ఏతల్లక్షణలక్షితములగు పద్యములే రంగరంజకముగ నుండును. ఈ సారస్యమును మన బాలకవి మిక్కిలి జాగరూకతమై గమనించియున్నాఁడు. చాలవఱకుఁ బద్యములు నాటక యోగ్యములుగనే యున్నవని నిరూపించుటకు రెండుమూ డుదాహరణము లిచ్చెదను.

(1)

తనయన్ ద్వత్కృతయజ్ఞదర్శనమహోత్సాహన్ ముదం బొప్పఁగా
గని మర్యాదలు సేయమాని యిటు యోగాగ్నిం బడంజూచె నా
ఘనమత్తాత్ముఁడు దక్షుఁ డాతని శిరః ఖండంబులన్ గాకగృ
ధ్రనికాయంబు భుజింపఁజేయఁగల భద్రస్థేమ సృష్టింపవే! పు 13 14.

(2)

నీదు సుతప్రలాపముల నీవు క్షమింపఁగఁజెల్లునే కదా
నాదుకళాప్రవీణత ఘనంబుగ మీ కని ధారవోసి యేన్
మేదురభక్తిఁ బార్వతిని మేచకకంఠుని గూర్తునొక్కచో
ఖేదము డించు ప్రాణము తెగించిలి నిప్పుడె పోయివచ్చెదన్. పు. 48

(3)

మనమునయందు నెందుఁ బరమాత్మను నిల్పి యఘంబువాయఁగా
మననము సల్పుచుండి తనమానసమందు ననన్యసౌఖ్యముల్
కనఁగను వాంఛవీడి చనఁగాఁ దగువారికి నన్యలోకమం
దునఁ గలుగున్ సమస్తమగు నోములకల్మలు పూవుఁబోణిరో ! పు. 70

పద్యములేగాక గద్యములు కూడ హాాయలుగులుకు నడకతో ను త్తేజకంబగు తీవితో రంగరంజకముగ నీబాలకవి విరచించియున్నాఁడు.

పద్మ—(కరంబులు ముకుళించి) స్వామీ! భవద్దర్శనంబున మాయఘంబులు ప్రళయ వాతసంస్పర్శనంబువలన ఘనాఘనంబులుం బోలెఁ బటాపంచలయ్యె. ఇదిగో పరిణామంబు స్వీకరింపుఁడు.

[పుట - 64]

పార్వ—మఱియు భవద్వదనారవిందంబునం దేదియో యొక్క యమందానందాంకు రంబు మోసులెత్తుచున్నది. అందులకుఁ గారణం బేదియో సెలవిం డాకర్ణింపఁ గోరుచున్నాను.

[పుట - 66]

రంగరంజకముగ నుండవలయు నన్నచో గద్యపద్యలక్షణము లిట్లే యుండవలయును. ఈ బాలకవి చాలవఱ కట్టి లక్షణములనే గమనించియున్నాఁడు.

# కవితాస్వభావము

ఈ బాలకవియొక్క కవిత్వము మృదుమధురపదశోభితమై హృద్యమైన పద్యములతోఁ జక్కని పాకములో వ్రాయఁబడియున్నది. గీర్వాణాంధ్రభాషలం దీ బాలకవికి సమానం బయ్యు ననమానంబై యున్నట్టి పాండితీవిశేషము గ్రంథమునం దెల్లెడలఁ దెల్లమగునట్లు వెల్లివిరియింపఁబడియున్నది. ఉభయభాషాపరిచయమును వెల్లడించు కొన్ని నిదర్శనముల నిచ్చట మచ్చునకు వ్రాసి చూపించుచున్నాను.

## సంస్కృతపదలాలిత్యము.

సకలకలాకలాపులు విశాలమనస్కులు సద్యశస్కులుర్
బ్రికటరసప్రకాశకృతిభాసులు సూనృతభాష లద్రిజా
స్వకరపరిగ్రహాంఘ్రినవపంకజలోలుపభృంగు లైన యీ
సుకవుల చెంతకుం బిలుచుచో నెపుదియో దయ నానతీయుఁడీ. [పు 2]

## అచ్చ తెనుఁగు నుడికారము.

నాదగుకూర్మిబిడ్డ రా
యంచ కనుంగు నెన్నడ లొయారము మీరఁగ నేర్పు దాని ...

*　　　*　　　*

ఉండ నిల్లును లేక పండ మంచము లేక
కొండవీటను గాటఁ బండువాని [పు.68]

*　　　*　　　*

మేలిమిపాల వెల్లిమిసిమిఁదలఁ దన్నిన మేనికాంతితో. [పు-56]

ఈ కవిచంద్రునితండ్రి హనుమంతరాయశర్మ పాకయాజిగారు శుద్ధాంధ్ర దాశరథిచరిత్రము మొదలగునట్టి యచ్చ తెలుఁగుగ్రంథములు రచించిన కవివరేణ్యు లగుటంజేసి యీ బాలకవికిఁ గూడఁ బదారేండ్లకే చక్కని శుద్ధాంధ్ర భాషాపరిచయ మలవడినట్లు తోఁచుచున్నది. ఏలయన నచ్ఛాంధ్రపదజాలముల విచ్చలవిడిగ నుపయోగించుటయకాక కొన్నిపద్యము లామూలాగ్రము నచ్చ తెలుంగుబాసలోనే యప్రయత్నముగ మనకవి కెఱుకలేకుండ నడచినవి. ఈ క్రిందిపద్యమును జూఁడుఁడు—

తే. గీ. బుస్సనును పాముసొమ్ములు బూదిపూఁత
కోర్లు బూతాలసేఁతలు గోచిపాత
కాటియునికియుఁ బుట్టె కే ల్లగ్గలువాని
కెవ్వ రిత్తురు కన్నియ నేనుగాక. [పు - 7]

## ధారాశుద్ధి

ఈబాలునికవిత్వమునందుఁ జక్కని ధారాశుద్ధి ద్యోతక మగుచున్నది. పదములు తమంతట తామే వచ్చి పద్దెములందుఁ దీర్చి దిద్ది నిలిచిన ట్లున్నవి. రెండుపద్దెములు మచ్చున కిచ్చుటఁ జూపించెదను.

మారా! సేమమె నీకు నీసలికి, వేమారుం దలంతే మమ్మ్ఱ,
శ్రీరామామణి నీదుతల్లి హరితోఁ జెల్వారుచుండుంగదా,
ఆరామప్రియుఁడౌ వసంతునకు సౌఖ్యం బున్నె, నీమోహపుం
భారావారములోన మంచుపని నిర్బాధంబుగా సాగునే. [పుట-44]

ఖగములునాక దుష్టమగు కౌనమేకంబులునాక కూ్రిరప
న్నగములునాక దుర్గమవనంబులునాక భవానిపోకకై
నగములు పట్టి కట్టి లీన నారలు కూరలుగాఁ దపంబుతో
సగ మయినట్టివాని కిటు చానను గూర్చిన నింత సేయునే.

## అనుకృతులు

ఈ కవి పిన్నఁవాడయ్యుఁ బురాతనాధునాతనకవిచంద్రుల పోకడలఁ గొన్నింటిని బుణికిపుచ్చుకొనియున్నాఁడు. ఇట్టి యనుకరణములు నాటకమున కెంతయో వన్నెను, వాసిని సమకూర్చుచున్నవి.

## పూర్వకవుల పోకడలు

అనుకారిపద్యము:—

నవకోరకితచూతనవ్రిశాఖలు గావు
గగనచుంబిమహీజగణముగాని.

అనుకృతపద్యము— భాగవతము:—దశమస్కంధము—ఉత్తర భాగము—154 పద్యము - నరకాసురవధలోని

సమదపుష్పంధయఝుంకారములు గావు
భీషణకుంభీంద్రబృంహితములు

## ఆధునికకవుల పోకడలు

(1) భర్త్రాజ్ఞ మీఱినపడతికి నిటువంటి
పాటులే కలవని చాటె ననుము [పుట—13]

(2) భక్తులహృదయంబుఁ బాయకుండెడివాఁడు
లోకనాథుఁడు చక్రి నీకుఁ దండ్రి [పుట—49]

ఇట్టివే యనుకరణములు చాలఁ గలవు. దీనంజేసి యీకవి యనేక నాటకములను జక్కఁగఁ బరిశీలించి తా నీ గ్రంథరచనకుఁ గడంగినట్లు తోఁచుచున్నది.

## బంగారుతునకలు.

ఈకవి తననాటకములోనిసీసపద్యముల కొక చక్కనిహాయిఁగలుగు నడకను సమకూర్చి, పద్యముల హృద్యము లొనర్చి, సీసమును సానరాపిడి వెట్టించి, జాతిరత్నములకుంబలెఁ జిన్నెలనెన్నింటినో తీర్చిదిద్దుటచే నందలి గమనములోని యమకమును గమనించినప్పు డివి సీసపుముక్కలుగావు, బంగారుతునక లుండెడి తీరున వెలుంగుచున్నట్లు చదువరులే గ్రహింపఁగలరు. ఈ గమనమును నిరూపించుట కుదాహరణ మొకటిమాత్రము చూపించెదను, గాని ప్రాయికముగ సీసము లన్నియు నిట్టినడకలోనే నడిపింపఁబడినవి.

కుడువ నొక్కింతయుఁ గూడు గానక యెప్డు
బిచ్చ మెత్తి భుజించు పేదవాఁడు
భిక్షంబునకునైనఁ బెద్దపాత్రము లేక
తలపుర్రె చేతిలోఁ దాల్చువాఁడు
ఒడలికి వసనంబు నొక్కఁడైనను లేక
పులితోలు పైఁగప్పి యలరువాఁడు
శృంగారములు లేక చిలువసొమ్ములు దాల్చి
పూఁత లేకయ బూదిఁ బూయువాఁడు
ఉండ నిల్లును లేక పండ మంచము లేక
కొండపీటను గాటఁ బండువాఁడు
సేవకు ల్లేక యా చెవిటిభృంగీశుతో
ముసలియెద్దును నెక్కి మసలువాఁడు
ఇట్టి సౌభాగ్యవంతుతో నెట్టు లీవు
కాపురంబుండి దినములు గడుపుచుండి
సౌఖ్య మెంతేని గాంచె దో సారసాక్షి!
వలదు వల దేల నీ కిటువంటిమగఁడు. [పుట - 68]

# ఉ ప సం హృ తి

నా యల్పమేధకుఁ దోఁచినంతవఱకు నాటకములోని కొన్ని యంశములను గుఱించి వ్రాసితిని. ఇంకను నేను వ్రాయక విడిచిన విశేషము లెన్నెన్నియో కలవని నేనే యెఱుంగుదును. కాని గ్రంథము పెచ్చుపెఱిగిపోయినదే యను భీతిచే నింతటితో నీ పీఠికను సమాప్తముఁ గావించి యిందలి నాకించిద్‌జ్ఞతాపరాధములను జదువరులు దయాళువులై మన్నింపఁగలందులకు వినయవిధేయుండనై వేఁడికోలు గావించుచున్నాఁడను. ఈ పీఠికను ముగించుటకు ముందుఁగ నీ బాలకవిచంద్రుని యశశ్శరీరమున కొక్క పద్యాంజలి నొసంగి చదువరుల సెలవుఁ గైకొని యింతటితో నిలిచెదను.

# నవరత్నాంజలి

వ్రాసితివా మనోజ్ఞమధువాసరభాసురశ్రీసరోజనూ
త్నాసవపానలీనరుచిరాద్భుతగాననిధానవై భవో
ల్లాసమధువ్రతస్ఫుటకళానిబిరీసకవిత్వమాధురీ
శ్రీసఖమైన కావ్యము నశేషబుధావళి మేల్ సెబా సనన్.

పుట్టకముందె నేర్చితివొ పుట్టినపిమ్మట నేర్చినాఁడవో
యిట్టి కవిత్వపాటవము లే పసికూనలు నాఁడు నేఁడు ని
ట్లుట్టిపడంగ వ్రాసిరి మహోన్నతకావ్యకళావిభూతిసా
మ్రాట్టన నీక చెల్లు ననుమానము లేదు, కవీంద్రచంద్రమా!

ఆనాఁడేను పురప్రభుత్వనిలయం బందున్నచో నీవు రాఁ
గా నీరూపధనంబుఁ గన్నుఁగవతోఁ గైకొంటి నా యప్పుడై
దీనిన్ వ్రాసి యొసంగి నే ఋణవిముక్తిన్ గంటిఁ గోదండపా
ణీ ! నీకీరితి మాత్రమే మిగులుటన్ నే నెట్లు దీవించెదన్.

నీకవితన్ బఠించుతఱి నిర్మలమానసహారవీచికల్
పైకొని పొర్లిరాక బహుభంగురబాష్పతరంగరంగముల్

నాకనుఁదమ్ములన్ ముసరి నన్ వెతలం బడఁద్రోయసాగె నౌ
రా! కవిచంద్ర! నీకు సుచిరాయు వొసంగని బమ్మఁ దిట్టెదన్.

పెద్దవై తన్నుఁ దన్నునన్ భీతిచేతఁ
బొడమెనో బృహస్పతి కింత కడుపుమంట
నీయశశ్చంద్రికలముందు నిలువలేక
రాక్షసపురోహితుఁడు నిన్ను రాల్చెనేమొ?

ఏకుమ్మయినన్ గానీ
నీకాయమునందుఁ గరుణ నిగిడించక యా
చీకు పితామహుఁ డౌరా
నీ కీరితిమేను ధరణి నిలుపఁదలఁచెనో.

చలనవిహీననిర్మలరసస్థిరబుద్ధివికాస శేముషీ
లలితకళాకలాపమృదులస్ఫుటవాగ్విభవైకనవ్యరూ
పలసదఖండకావ్యము శుభస్థితి నీదగుపేరు నిల్పఁ జిం
తిలఁదగదంచుఁ గంటఁ దడి నెట్టన నెట్టితి నెట్టు లెట్టులో.

వాణి! దోసిళ్ల నీవాణి ముత్యాలిమ్మ
దొరకింపలే విట్టి దొరకైత,
రాచిల్క! రతనాల రా చిల్కరింపుము
పొసగింపలే విట్టి పూపకైత,
భ్రమరమా! నీకేటిభ్రమ రమారమియైనఁ
బలికింపలే విట్టి జిలుగుకైత,
మదమరాలంబ! దుర్మదమ రాలంబడ్డ
రవళింపలే విట్టి కవటకైత,
రసనిబిడశబ్దసృష్టిసామ్రాజ్యములకు
మీరు పట్టాభిషిక్తులైనారెగాని

నేఁటి కోదండపాణివాగ్ధాటియెనుటఁ
జేతకాని దద్దమ్మ లైపోతి రహహ !!!

కాని సముక్షమందు నిను గన్నుల నద్దుక పొలుకారు నీ
మానితమైనమోముజిగి మానకమెచ్చి భవత్కవిత్వస
న్మానముఁ బీఠికాముఖమునన్ వినిపించెడి భాగ్యరేఖ నా
కీ నొసటన్ సరోజభవుఁ డేల లిఖింపకపోయెనో కదా !!

మకాం : గుంటూరు,
శ్రీ యువ. శ్రా. శు ౨,
గురువారము,
1—8—1935.

ఇట్లు సెలవుఁగొని నిలిచియుండు
బుధవిధేయుఁడు,
అచ్యుతుని వేంకటాచలపతిరావు,
బాపట్ల, గుంటూరుజిల్లా.





కృతికర్త:

అబ్బరాజు వేంకట కోదండపాణిశాస్త్రి.

జననము:—కాళయుక్తి చైత్ర బ ౭ స్థిరవారము (4—5—1918)

మరణము:—శ్రీముఖ ఆశ్వయుజ శు ౯ బుధవారము (27—9—1933)

ఓమ్.

# సంపాదకీయ భూమిక.

సోదరీసోదరరత్నంబులారా! పాఠకమహాశయులారా!

## శ్రీ పా ర్వ తీ ప రి ణ య ము.

అను నీదృశ్యకావ్యము (నాటకమును) వ్రాసిన అ. వేంకట కోదండపాణిశర్మ శాస్త్రి యను చిన్నవాఁడు నాకుమారులలోఁ బెద్దవాఁడు. వీఁడు కాళయుక్తి సంవత్సర చైత్ర బ ౮ లు శనివారమున జన్మించినాఁడు. ఐదవయేఁడు మొదలు దాదాపు తొమ్మిదవయేఁడువరకు నాదగ్గర కొంతకాలము రఘువంశము నాలుగుసర్గలు, తదుపరి బ్ర. పోతుకూచి రామమూర్తి శాస్త్రిగారిచెంతఁ గుమారసంభవ, మేఘసందేశ, కిరాతార్జునీయములు, చదివినాఁడు. తరువాత పదియవయేట నుపనీతుఁడై బ్రహ్మచర్యవ్రతము జరుపుకొనుచు సంధ్యావందనాగ్నికార్య బ్రహ్మయజ్ఞ విఘ్నేశ్వరపూజాదికమంత్రములు బ్ర. కొమ్మరాజు లక్ష్మీనారాయణశర్మగారిచెంతఁ బఠించినాఁడు. ఆమీఁదట మాఘనైషధములు కొన్నిసర్గలు, సిద్ధాంతకౌముదియందుఁ బంచసంధులు బ్ర॥ నందిరాజు పూర్ణచంద్రశాస్త్రిగారి దగ్గరఁ జదివియున్నవాఁడు. ఇంతలో నాంగ్లవిద్యాభ్యాసముచేసి 4 వ ఫారము ముగించువరకుఁ బెరవలి మాధ్యమిక పాఠశాలలోను, 5, 6 ఫారములు రేపల్లె యున్నతపాఠశాలలోను జదువుచు వచ్చినాఁడు. 5 వ ఫారము చదువుచునే విద్వాన్ ప్రవేశపరీక్షలో నుత్తీర్ణుఁడయ్యె. ఆరవ ఫారము చదువుచునే యీ నాటక మప్పుడప్పుడు వ్రాసినాఁడఁట. దీనిని మొదలిడుట కాని ముగింపఁజేయుటకాని నే నెఱుఁగనే యెఱుఁగను సరికదా, వానిచేతిమీఁదుగఁ దప్పొప్పు వ్రాసినానని నాకుఁ దెచ్చియిచ్చుటకు నోచుకొనలేదు. తుద కారోగ్యముతోనుండియే శ్రీముఖ భాద్రపద బ 30 లు మంగళవారము సన్నిపాతజ్వర పీడితుఁడై 8 లంఘనములుచేసి ఆశ్వయుజశు ౧ లు బుధవారమునాఁడు మమ్మత్యంతశోకసముద్రమున ముంచి కాలగతి నొందెను.

" కం. ఆట్టేల జగము లన్నియుఁ
బుట్టింపం బెంపఁ ద్రుంపఁ * బురుషులు మువ్వురై
పుట్టిన వేలుప వఁట నా
పట్టియెడం దగునె నడిమిపని మానుటకున్. "

—సోమునిహరివంశము - ద్వి. ఆ.

అని శ్రీకృష్ణపరమాత్మతో భూదేవి యన్నట్లు, పుట్టించిన దేవుఁడే వాని పోషణ కార్యము మానినప్పుడే నేమిచేయఁగలను? ఈ జరిగిన నిజస్థితి నెల్లవారికిం దెలిపి దీనిని తెలువరుతమని యింతదనుక వ్రాసితినేకాని వేరుకాదు. దీనిని గన్నీటితో నే నీయ సాగోఁడుఁ జూడలేక సవరించియిచ్చిన బ్రి. అక్కరాజు నరసింహారావుపంతులు వారికి, బ్రి. అచ్యుతుని వేంకట చలపతిరావు పంతులువారికి, ముద్రణవిషయమున సాయపడిన మిత్రకోటికిని, నేనెంతయుఁ గృతజ్ఞుండనై నమస్కారశతము లర్పించుచు నీవిషయ మింతటితో ముగించుచున్నాఁడను.

ప్రస్తుత నివాసము:
రేపల్లె,
25—11—1933.

ఇట్లు,
కన్నీటితో విన్నవించువాఁడు,
అబ్బరాజు హనుమంతరాయశర్మ.

---

ఓమ్.

# పండితాభిప్రాయములు.

శ్లో. శ్రీపార్వతీపరిణయాహ్వయనాటకస్య
కర్తా యశోఽర్జయతి షోడశవార్షికోఽపి
కోదండిపాణి రనఘ శ్చిర మాత్తవిద్యః
కాలాగమానుభవయుక్కవిమార్గగామీ.

శ్లో. అధీత్య చిర మంతికే బహువిధాగమాన్సద్గురో
ర్నిరీక్ష్య విబుధావళిం బహుపరీక్ష్య కాలస్థితిమ్
యథామతి వినిర్మముః కవివరాః ప్రబంధాన్ క్రమా
దహో! కవి రరీరచ ద్గురుకులే పఠన్ నాటకమ్.

భావపురి, 1-4-34.

వేమూరి నృసింహశాస్త్రీ,
శతావధాని.

---

తే. సరసగతితోడఁ బార్వతీపరిణయంబు
నాటకంబుగఁ గూర్చి వాఙ్మరి కింపు
బెంచు నగఁగా ఘటించి యర్పించె నౌర!
భక్తి వేంకటకోదండపాణిశాస్త్రి.

ఉ. బాలకుఁ డయ్యుఁ దా నుభయభాషలయందుఁ గవిత్వ మల్లఁగాఁ
జాలి రసంబులం బొదలు చక్కనిపద్యములం ఘటించి యీ
లాలితమైననాటక మిలన్ విబుధావళి మెచ్చఁ గూర్చె శ
య్యాలలితంబుగా మృదుపదాన్వితమై యలరారునట్లుగాన్.

తే. తాత 'శేషాచలాఖ్యుండు' తాను కవియు;
తండ్రి 'హనుమంతరాయండు' తాను కవియ
తాతతండ్రులమార్గంబుఁ దప్పకుండఁ
దానునుం గవియయ్యెఁ గోదండపాణి.

శా. తానుం బాలకుఁ డౌటచే మొదటిగ్రంథం బౌటచే భావనం
తానం బందున నెందునేని నుచితార్థ్వం బొక్కొ డర్గ వీడిన్గ
స్థానీయం బగుపాత్రపోషణము నున్ఛ్వైత్కల్పనల్ గూర్చి య
త్యానందంబు ఘటింపఁజేసె రసభావాళిన్ బుధుల్ మెచ్చగన్.

శ్లో. శ్రీపార్వతీపరిణయం రూపకరూపేణ పుస్తకం రచితం,
కోదండపాణినామ్నా జీయాత్కోదండపాణికృప యోర్వ్యామ్.

తెనాలి, 6-4-1934 } ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రి, శతావధాని.

---

తే. భవ్యతరముగఁ బార్వతీపరిణయంబు
రూపకముగఁ బదాఱేండ్ల ప్రాపునందె
చేసి సత్కీర్తి గొంటివి చిన్నతనము
నం దెటుల విద్దె లార్జించి తౌర పుత్ర!

తే. సదమలానందముగ బ్రహ్మచారి వగుచు
బాంధవుల కెల్ల కన్నుల పండువుగను
దిరుగుచుందువు చూపఱు లరుస మంద
పూర్వమునిడింభకునిబోలె ముద్దు లొలుక.

తే. బ్రహ్మవర్చస్సు నీయంద ప్రబలుచుంట
సర్వకాలము పితృభక్తి సలుపుచుంట
సర్వసుగుణాంబురాశివై జగతి మనుటఁ
జూడ మద్వంశ ముద్ధరించుటకు జనన
మందితి వటంచు నుత్సాహ మయ్యెఁ గుఱ్ఱ!

తే. సాటిబాలురలోపల మేటి వగుచు
సంస్కృతాంధ్రాంగ్లభాషలఁ జక్క నేర్చి
దీక్షతోడను 'విద్వాన్'పరీక్ష గెలిచి
పండితుఁడ వైతి వహ్వా కోదండపాణి!

తే. గ్రంథరచనను గావింపఁ గడగువేళ
దండ్రికి సలహాల నొసంగఁ దాల్మి నుడువ
రాని సంతోషముంగూర్చు సూనుఁ డన్న
నీవ సూనుండ వెన్నఁగ నిశ్చయముగ.

ఆ. కొలఁదికాలమునకె కోవిదాళి నుతింప
నాటకంబు వ్రాసినావు కుఱ్ఱ!
చెలఁగి నీవు నింక చిరకాలజీవివై
మనిన మాయదృష్టమును దెలుపనె.

తే. తండ్రిభారంబు నీయుంద తలఁగఁద్రోసి
ఆత్మశుద్ధిగ రామ కృష్ణా యటంచుఁ
గాలముం బుచ్చ యత్నింపఁగా సురాల
యంబునకుఁ బండితుండవై యరిగితయ్య!

తే. దీక్షితచరిత్రయందునఁ దేరిచూడఁ
బూనువారికి నీయూర్ధ్వపుండ్ర మాది
సర్వకళలును బ్రత్యక్షసరణి తోచు
వహ్వా! వేంకట కోదండపాణిశర్మ!

తే. స్వర్గలోకంబునను మనస్స్థాయి గల్గి
హాయిగా నుండుటకును సహార్నిశంబు
దేవదేవుని భక్తిఁ బ్రార్థించువాఁడ
అబ్బరాజు సీతారామయాభిధుఁడను.

వేటాప్రియుని అప్పాపురము,
వినుకొండతాలూకా,
16—6—1934.

ఇట్లు బుధజనవిధేయుడు,
అబ్బరాజు సీతారామశర్మ,
బోర్డు ఎలిమెంటరీస్కూలు మాస్టరు.

---

చ. బరువడి ముత్తెఫున్సరులు ♦ బాగుగఁ గూర్చినరీతిఁ, బూర్తిగా
విరిసిన పూవులంబలెను ♦ వేగమె కమ్మనిపుట్టతేనియల్
వరదలు పారినట్టుల జ♦వాజిఘుమంఘుమలాడు వాసనల్
కరముగ నెల్లతావులను ♦ గప్పునఁ గ్రిమ్మినభాతి, శబ్దముల్
పొరలఁగ మార్దవంబు రస♦పుష్టి, వినంగనె తోచు భావముల్
మెరయఁగఁ గ్రొత్తపోకడలు ♦ మీరఁగఁ బండితముఖ్యులెన్న శ్రీ
హరికృపఁ బార్వతీపరిణ♦యం బను నాటక మీవు వ్రాసితో
వరగుణ! అబ్బరాజకుల♦వార్ధిశశీ, హనుమత్సుధీసుతా!

సీ. వినుగుదోపనిమాడ్కి ♦ వెలయు సంకములు సం
కములకుం దగిన రం♦గప్రకరము
రంగాల కనువయి ♦ రాజిల్లు పద్యముల్
పద్యంబులకుఁ దగు ♦ భావగరిమ
భావంబునకు సరి♦పోవు పాత్రోచితి
పాత్రల కనువైన ♦ పాకశుద్ధి
పాకంబునకు నను♦ప్రాసయౌ రీతులు
రీతు లనుసరించు♦వృత్తు లెన్నొ
కలుగఁగాను స్వభావో♦క్తు లలర మిగుల
ముద్దుల న్మాటఁ గట్టిన ♦ పోల్కి, నాట
కంబు వ్రాసితి వమితమో♦దంబు గలిగ
భళిర రిపుశస్త్రి! కోదండ♦పాణిశాస్త్రి!

గీ. తాతతండ్రులు పండిత♦ఖ్యాతకవులు
నగుట వారలకీర్తి హె♦చ్చుగను జేయ
సంస్కృతాంధ్రాంగ్లభాషావ్ర♦శస్తమైన
పాండితి గడించినావె కో♦దండపాణి!

ఇట్లు,
మంచికంటి వేంకటేశ్వరరావు,
సంతగుడిపాడు.

# అ. వెం. కోదండపాణిస్మృతి.

—: ద్విపద :—

కటకటా! నిన్ దల్పఁ గన్నీరు గ్రమ్మ
సొటసొట నేలపై సోలుచున్నారు
నీతల్లిదండ్రులు నీవియోగమున
కై తాళ లేక దుఃఖార్తి నున్నారు
ఏలరా! బాలక! యింత చేసితివి?
ఏల నీ కపుడె నూరేండ్లు నిండినవి?
బ్రదుకని బిడ్డ పేర్ బారె డన్నట్లు
బ్రదుకులేమియొ నీకుఁ బ్రాభవం బింత
కంటిచూపునకైనఁ గడుఁగందు మేను
గంటు సోకినఁ బాలు గారెడి మోము
బసిఁడికైనను జాయ బదులీయఁ గలుగు
మిసిమియు, యోగీశు మించు శాంతమును
చుఱకత్తిఁ బోలిన సూక్ష్మబుద్ధియును
నొఱగాకపోయెనా కోదండపాణి!
పరమేశ పార్వతీపరిణయ సుకృతి
కరము తోడై నిన్నుఁ గావలేదాయె
కోదండపాణీశుకోదండపాణి
గాఁ దోఁచి నిన్నగ్గికన్జూపు జూచి
పమ్మొనర్చెనో యేమొ పార్వతీధవుఁడు
బమ్మకైనను జిమ్మ పరగు నన్నట్లు
చాలురా, బాలక! సంతోష మయ్యె
మేలైన రతనాలు మిల్లెడే చాలు
ఘనమైన మనుగడ గడియయే చాలు
జనియించువాఁ డెల్లఁ జనువాఁడె సుమ్ము

మనఁబోఁడు జగమున మన్వంతరమ్ము
జను లెల్ల మెచ్చెడుచరిత ధన్యమ్ము
పదియారువర్షాలె బ్రదికిన నేమి
పదుగురు మెచ్చఁగాఁ బరగితి వీవు
కవితాకళలు గల్గి గణన కెక్కితివి
దివి కేగినాఁడ వా దివ్యులు మెచ్చ
నీయాత్మ కట శాంతి నిత్యంబు గలుగు
నీ యాప్తకృతి యిట నిత్యమై పరగు
గావుత మని యీశు గణుతించువాఁడ
కావున మా కింకఁ గలుగు నూరటలు.

అక్కరాజు నరసింహారావు,

15—1—34.

# కృత్యభిప్రాయ

## ప్రకటనకారణము.

తే. శార్ఙకోదండపాణియంశమునఁ బుట్టి
నట్టి కోదండపాణిపేరట్టె తాల్చి
యిక్షుకోదండపాణిలా గీశ్వరికిని
మేరుకోదండపాణికిఁ బెండ్లిఁ గూర్చి
తెగితె కోదండపాణిశాస్త్రీ! కుమార! 1

తే. పెండిలియొనర్చి కవులను బిల్వనంపి
వారు నినుఁగూర్చి వ్రాసిన పద్యములను
జెవుల విననోచుకొనలేని చెడుగు నగుట
నిట్లు గావించి తీవేను నెదలఁ బొదల. 2

తే. తాత కృత "మాఘమాహాత్మ్య" ధర్మదాత
తండ్రి కృత "దాశరథిచరిత్ర" కృతినేత
నందనుఁడు "పార్వతీపరిణయఁ"పుగర్త
బళిర! యనఁ జల్పితివి కృతి పాణిశాస్త్రీ! 3

రేపల్లె, 25-7-35.

ఇట్లు,
అ. హ. శర్మ.

---

బ్రహ్మశ్రీ అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజిగారికి:—

ఆర్యా,

తమ కొమరునిచే రచింపఁబడిన పార్వతీపరిణయ దృశ్యప్రబంధమును బరిశీలించితిని. ఇట్టి చిఱుతప్రాయమునందే నాటకమును వ్రాయఁబూనుట సాహసము. ఈ బాలకవికి బహుశః కుమారసంభవకావ్యము పఠించునాఁడే యా లోకదంపతుల వివాహకథను నాటకమొనర్పఁ గుతూహలము బొడమియుండనోపు. అయ్యది కార్యరూపముఁ దాల్చెను.

రచనానైపుణ్యముఁ జూచినచో నిట్టి బాలకవిం గోలుపోవుట మన దేశమున కొక గొప్ప కొఱత యని భావింతును. ధారాశుద్ధియు, రసపోషణమును, పాత్రపోషణయు, పదగుంభనమును ముచ్చటగా నున్నవి. పద్యములఁ గొన్నిఁటఁ బూర్వకవుల పోలికలు గానవచ్చుచున్నవి. కవికల్పనాకౌశలమును, సామెతల సమయానుకూలముగఁ బాత్రలచేఁ బలికించుటయు మనోహరముగ నున్నవి. దైవము దీర్ఘాయు వొసఁగిన దేశమునకును నాంధ్రగీర్వాణభాషాప్రపంచమునకును మహోపకార మయ్యెడిది.

గుంటూరు,
14-7-1935.

దాలిపర్తి దుర్గాప్రసాదరావు,
యమ్. ఏ., బి. యల్., యల్. టి., వకీలు.

---

బ్రి. శ్రీ. అబ్బరాజు హనుమంతరాయశర్మగారియాత్మజుండైన వేంకటకోదండపాణిశర్మశాస్త్రియను బాలునిచే నీ 'పార్వతీపరిణయము' అను నాటకము రచింపఁబడినది. ఈ గ్రంథమును నేను బరిశీలించితిని. బాల్యమునందు సాహిత్యమునఁ గొంత జ్ఞానము సంపాదించి, సిద్ధాంతకౌముదియందుఁ బంచసంధులు బఠించి, కవిపుంగవులు, విమర్శకాగ్రేసరులు బళిరా! యని మెచ్చఁదగిన ధారాశుద్ధిని శర్మశాస్త్రి కలిగియుండెను. ఈ నాటకమును బదునాలుసంవత్సరముల వయస్సునందే రచించెనన్నమాట స్మరించిన శ్రీ పరమేశ్వరుఁడు వీనికి నాయువు నొసంగియుండినచో నితఁడు విద్యాబుద్ధులు సంపాదించి పెద్దయై ఆంధ్రభాషామతల్లికి నెట్టిసేవయొనరించియుండెడివాఁడో కదా యని నాకు నాశ్చర్యము గలుగుచుండును. ఇతనికవిత్వశైలి యానందజనకముగ నుండును. కవివయస్సునుబట్టి చూచినచో ఇతని కల్పనలు, పదప్రయోగము, గద్యరచన విమర్శకుల నాకర్షించును. ఇతనికవిత్వమునందు నభివృద్ధిసూచనలు గలవు.

ఎక్కడివాఁడనో యిటుల నింపునిచే............
కలువపువుల్ కనుల్ చిగురుకావిజిగాజిగి మోవి......
ఆసన మీయఁగాఁ గొనక యారడిపెట్టు........
ఆ నగుమోముచందము.....................

మొదలగు పద్దెముల మచ్చునకుఁ బరిశీలింపనగును.

కవిత్వము చిత్రకళలలో నొకటి. కొందఱు కవులు నభ్యాసవశమున నీకళయందు నైపుణ్యమును సంపాదింతురు. కాని యట్టి కవుల రచనలందుఁ, బ్రారంభమునందుఁ గూడ విశేషములు గన్పట్టుచుండును. అట్టి విశేషములు బహుగ్రంథవిమర్శనమొనరించినవారు తెలిసికొనఁగలుగుదురు. శర్మశాస్త్రియు నట్టి కవులలోఁ జేరఁదగువాఁడైనను వాని కట్టి భాగ్య మబ్బదయ్యెను. ఇది జన్మాంతరకర్మఫలము.

ఆరండెల్ పేట
గుంటూరు
12-5-35

పుచ్చా వరదరామ కృష్ణయ్యా, M. A.
సంస్కృతాంధ్రోపన్యాసకుఁడు
కాలేజి, గుంటూరు.

---

అయ్యా!

శ్రీ. శే. డైన మీకొమారుఁడు రచించిన పార్వతీపరిణయనాటకము జూచినాను. సర్వవిధముల రమణీయముగా నుండుటచేఁ గ్రంథకర్త "అహం బాలో౽పి భూపాల! న మే బాలా సరస్వతీ" యను నభియుక్తోక్తి కుదాహరణము గాఁదగువాఁడని నా యభిప్రాయము. తక్కిన దైవదుర్విపాకమునకుం జింతించి చేయునదిలేదు. "తస్మాదపరిహార్యే౽ర్థే న త్వం శోచితు మర్హసి" అను గీతావాక్యము తా మెఱుంగనిదికాదు. కావున విస్తరింపక ముగించుచున్నాను.

కడియము
తూ. గో. డి.
15-5-35.

చిత్తగింపుడు,
చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి,
శతావధాని.

---

అయ్యా,

అ. వేంకటకోదండపాణిశాస్త్రి యను బాలునిచే రచింపఁబడిన పార్వతీపరిణయనాటకము బాలకవిత్వమువలెఁ గాక చక్కని పోఁకడలును జక్కని కూర్పు గల్గియున్నది. ఇతఁడు చిరంజీవి యైనచో ముం దుత్కృష్టకవితాకలాప్రౌఢుఁడై భాషాయోషామతల్లి కతిప్రియుండై యుండనోపు నని తోఁపింపఁజేయుచున్నది. అట్టిభాగ్యమందలేమి యాంధ్రదేశదురదృష్ట మనక తప్పదు.

కొవ్వూరము,
16-5-35.

ఆశుకవిచక్రవర్తులు,
కొ. సోదరకవులు, శతావధానులు.

---

అయ్యా,

అత్యంత బాల్యవయస్సునందే యాంధ్రగీర్వాణాంగ్లభాషాభ్యాస మొనర్చి యద్భుతప్రతిభావిశేషసూచకముగాఁ గవితారచనకుఁ గడంగిన మీ గారాబుకొడుకు కోదండపాణిశాస్త్రి యత్యల్పాయుష్కుఁడై పోవుట యెంతయు శోచనీయము. తత్కర్తృకమగు పార్వతీపరిణయ నాటకరచనము తలకుమించిన పనియని చెప్పటకు సందియము లేదు. అందలికవిత్వము కవివయోనుగుణములైన గుణవిశేషములతో వెలయుచున్నది.

కవితావిలాసము,
పిఠాపురము,
14-6-35.

చిత్తగింపుడు,
ఓలేటి వేంకటరామశాస్త్రి,
రాజాస్థానపండితుఁడు.

---

అయ్యా!

తమ పుత్రరత్నముచే వ్రాయఁబడిన పార్వతీపరిణయమును (నాటకము) సావకాశముగఁ జదివితి. శైలి బహు చక్కగ నున్నది. సందర్భోచిత పద్యములు కడు రమ్యముగ నల్లఁబడి యున్నవి. అనేక సంవత్సరములు సంస్కృతాంధ్ర గ్రంథముల నభ్యసించిన వయోవృద్ధులకు, జ్ఞానవృద్ధులకుఁ గాని యిట్టి గ్రంథము రచించుటకు సాధ్యపడదనుట యతిశయోక్తి కానేరదు. అనేక సందర్భములందు విషయముల కూర్పు, ముద్దులు మూటగట్టున ట్లున్నది. కడు పిన్నవయసుననే యిట్టి గ్రంథము రచించినవాఁడు దీర్ఘాయుష్మంతుఁడుగా నుండిన లోకమున కెంతో యుపకారము గలిగి యుండెడిది. కాని భగవదిచ్ఛ వేరుగ నున్నది. మంచిపండువెంటనే యమ్మక మగుచున్నది. "Whom the God loves die young" అని యాంగ్లేయవాక్యము గలదు. ఈ గ్రంథము మూలమున "యశఃకాయేన జీవితమ్" అన్నట్లు గ్రంథకర్త (కీ. శే. అబ్బరాజు వేంకట కోదండపాణిశాస్త్రి) జీవించియున్నట్లే. అనేకవందనములు.

మకాం,
నరసారావుపేట,
13-5-35.

కోరంకి వేంకటరామశర్మ,
Retired Assistant,
Hindu High School,
Masulipatam.

---

ఉ. బాలుఁడెగాని వీఁడి తని భారతి పూవులచాలుగోలయై
మేలగు తేనెసోనరుచి మించిన పల్కుల విద్యదాదర
శ్రీలలితాంగియాచుఁ దనరెం; దురితికాలములోన వీనికిం
గాలము తీరె? దైవహతకా! యిటు సేఁతలు రోఁతలే కదా?

చ. మరణము నొందె యీకవి యమాంతము నశ్వరమూర్తి వీఁడె య
క్షరతనువున్ సృజించి మనకన్నులఁ గట్టెను, వీని పార్వతీ
పరిణయనాటకంబ, యది పాపహరంబయి పాతకాలికిన్
సిరఁదిరమై వెలుంగుత, సుధీపరికరంబున కింపు నింపుచున్.

గుంటూరు.
14-7-35.

కాశీ కృష్ణాచార్యులు,
శతావధాని.

---

ఓమ్.

శ్రీహయగ్రీవాయనమః.

శా. శ్రీనాథాప్తుఁడు భోగిభూషణుఁడు సచ్ఛీర్షాంచితేందుప్రిందు బ్రి
హ్మానందాత్ముఁడు దీనపోషకుఁడు నయ్యద్రీశపుత్రీశుఁడున్
నీనవ్యాంచితకావ్యకన్యకకు శాశ్వతాచ్ఛదేహుండు, నీ
శానుం డేర్పడ నీయశంబు నిల శిష్యా! రంజిలన్ జేయుతన్. ౧

ఉ. ద్వాదశవత్సరాలనె యథావిధి కౌముది నైషధాంతమున్
మోద మెలర్పఁ గావ్యతతి బొక్కిట నుంచి తెలుంగుబాసలో
నాదికవీశు మించు పస నంది యనంతయశంబు గాంచితే
నీదుచరిత్ర మచ్చెరువు! నిక్కము జ్ఞానికిఁ బ్రాయ మేలొకో? ౨

చ. నవమధుబిందువుల్ గురియునాట్యరసాన్వితమై తనర్చుచున్
నవసుమకల్పితం బయినవాడెఁపుసెజ్జ హసించుశయ్యతోన్
జవిగల ద్రాక్షపాకము పిసాళిగలట్టి విదర్భరీతితో
నవుననఁ బార్వతీపరిణయంబు వెలుంగు సలక్షణంబుగన్.

తే. గీ. ఇట్టికబ్బము వ్రాయఁగలట్టినీవు
ఆంధ్రగీర్వాణభాషల నాదరించి
ఉద్ధరింతు వనుచు నుండ నిద్ధరిత్రిఁ
బాసి మము శోకవారాశిపాలుఁ జేసి
ఉండనేగితే దివికి కోదండపాణి? ౪

తే. గీ. సారెది సుకృతీ గతాయువన్ సూక్తి నీ య
కాలమరణమ్మువలననే కాంచఁగలదు
అవని నీకీర్తి శశికాల మతిశయిల్లు,
నీకుఁ డాత్మశాంతిని నీశు నిచ్చుఁగాత. ౫

రేపల్లె,
1-6-1935.

ఇట్లు,
అద్వైతమతస్థాపక, నందిరాజ పూర్ణచంద్రశాస్త్రి

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

ముప్పాళ్ల.
20-5-1935.

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజిగారి
దివ్యచరణారవింద సన్నిధానమునకు:—

తండ్రీ! వేంకటకోదండపాణిశాస్త్రీ!

సీ. పదియారువన్నెయబంగారు నెడమపాదమునఁదన్నెడి మేనితళుకుతోడ
ఆశ్రమధర్మాల ననుసరించి చరించుశంకరుదివ్యతేజస్సుతోడ
బెట్టనిసొమ్మనా వెలుఁగొందు సహజశాంతమ్మను వరకవచమ్ముతోడ
వాసనల్ వెదజల్లు పారిజాతమువోలె నశ్రాంతవిశ్రాంతయశముతోడ
తనరు నీ వేమితలపెట్టి చనితొ దివికి బదియునైదేండ్లు పై నర్ధవత్సరమ్ము.
గడచినదో లేదొ! యెన్నరకాలచింత జతపరచితివి వృద్ధదంపతులకకట!

సీ. పనసతొనలకన్న ననటిపండులకన్న రుచియైన నీవాక్కు లెచట విందు
సకలసంపత్కళాసదన మౌ నీమోము నింక నాకనులతో నెటులఁగందు
నవ్యమౌ తేనెపానకము నాఁ వెల్గునీ కైతాన నే నెప్డుప్రీతి బొందు
గ్రీగంటిచూపులలోఁ గ్రాలునీభావ మేనాఁడు నాపయి నెగసిచిందు
బళిర; అరచేతిలో నిమ్మపండు గ్రద్ద తన్నుకొనిపోయినట్టుల నిన్ను మృత్యు
దేవత గ్రసించె నీలోటు తీరుటెట్లు? లేమొ కానిమ్ము వచ్చుచున్నాము మేము.

సీ. దీక్షితుఁడోయనఁ దేజరిల్లెడినీవు పోవ రేవల్లె దోబూచి యయ్యె
సంపూర్ణపూర్ణిమాచంద్రుడోయనెడి హైస్కూల్ గ్రహణము నాటిశోభ యయ్యె
దోసతోఁట యనంగఁ దొడరెడి నీయిల్లు వెక్కువిచారాల కిక్కయయ్యె
పుష్పాక్షతలతోడఁ బొదలెడి నిత్యాగ్ని పాచిబూడిదెతోడ వఱలనయ్యె
అరరె; గిద్దెడుబియ్యంపుటన్నమున్ భుజించు నీవొక్కఁడవు చన నెంత మార్పు
కనుపడుచున్నయది కండ్లగట్టినట్లు స్వప్నమందేని కనుపడిచనఁగదయ్య.

సీ. పరుపుపైనిద్దుర పట్టకపొర్లాడు నీ వాచిలిన్ బెద్దనిద్ర పోతె
గోరు గుచ్చుకొనఁ గగ్గోలుజెందెడునీవు కకవికపడక మంటకు సహింతె
తాకినఁ గందుమెత్తనిమేను గలనీవు కట్టెలన్ బిగియింపఁగా భరింతె
ఎండ సోకినఁ బూటఁబండుకొనెడినీవు మండునేసఁగి బైటనుండ నెంతె
యిన్నికష్టాల నీకు లిఖించుకతన బుట్టుపూజావిహీనుఁడై బోలెడప్పు
లందుమున్గుచుఁ దేలుచు ననవరతము నాభిపుట్టిల్లుగాఁగ నున్నాఁడు బమ్మ.

సీ. తాత వైదుషియందు ధాత తండ్రిమహాప్రసిద్ధపండితుఁడు నశేషధర్మ
విదుఁడు నీ వన్నిటఁ బెద్దవై వయసునఁ జిన్నవయ్యునుఁ గవిశేఖరుఁడవు

కౌముదీహారి వాఙ్మయమున స్కూల్ ఫైనలు విద్యార్థిపదిగాక విమలకీర్తి పొందుచుండవు నియోగిశాఖాసముత్పన్న విజ్ఞానశేముషీవిభవులందు. తరుగులేదెందుఁగాని చిత్రముగ నొక్క పూటజ్వరమునకే తనువుఁ ద్యజించి చనితె దివికి రామేశ్వరశాస్త్రి యనెడి నామమారుని స్నేహ మ్మునకును గుఱ్ఱు!

ఇత్థం బుధవిధేయపరమాణుః,

శతావధాని గోపాలుని హనుమంతరాయశాస్త్రి,

శారదానివాసమ్, ముప్పాళ్ళ,

వినుకొండతాలూకా.

---

మ. అసమాన ప్రతిభావిశేషలలితుం డామ్నాయవేద్యుండు తా
మసరాహిత్యుఁడు నిత్యుఁడైన ప్రభు వీమాయబ్బరాజ్వంశ ది
వ్యసుధాంభోనిధి పూర్ణచంద్రుఁ డనఘుం డైనట్టి కోదండపా
ణి సమాభిఖ్యుని కీర్తిచంద్రికల నిండించుఁ దిగంతంబులన్.

గీ. పదియు నారేడులేడ రూపకవిరచన, పటిమ మదియేడ గ్రహయోగబలముగాక
పూర్వజనిపుణ్యపరిపాకపూర్తిగాక యీడునకుఁ దగు విద్యయే యెంచిచూడ.

గీ. చూడకుండిన కబ్బంబు జూచినంత, బలుకకుండినఁ బరులు చెప్పంగవినుట
నస్మదాదులకే యింత యార్తిగలుగఁ, దల్లిదండ్రుల యెదలెట్లు తాళియుండు.

ఉ. యోగము లెన్నియున్న నుపయోగము లేమగదన్న సత్కళా
యోగము లున్న నీశ్వరనియోగమ దిట్టుల నుండెనన్న సం
యోగము సున్నయై సుతవియోగము గల్గెగదన్న యింక ను
ద్వేగము మానుమన్న ప్రభవించుట గిట్టుటకన్న నగ్రజా!

మ. పదలాలిత్యము పాత్రపోషణము భావస్ఫూర్తియుఁ లక్షణా
భ్యుదయంబుల్ దగు సాహితీపటిమ లోకోత్తల్ విలాసోక్తులున్
సదలంకారవిశేషముల్ సమయవాత్సల్యపూర్తి సద్వృత్తసం
పద చూపట్టెడిఁ ద్వత్కుమారకృతకావ్యంబందు నో యగ్రజా!

ఇట్లు భవత్సోదరులు,

తొండపి,
15-5-35.

అబ్బరాజు పిచ్చయ్యశర్మ,
యీా వేంకటేశ్వరశర్మ,
యీా లక్ష్మీనరసింహరాయశర్మ,
సోదరకవులు.

---

## పార్వతీపరిణయము.

(అబ్బరాజు కోదండపాణిశాస్త్రికృతము.)

తే. గీ. అబ్బరాజుకోలంబు ధన్యమునొనర్ప, వచ్చి వేంకటకోదండపాణిశాస్త్రి
వ్రాసిపెట్టిన పార్వతీపరిణయంబు, జూచినాఁడను ముచ్చట దోఁచుకతన.

తే. గీ. చిరతరకాలకటినాఁడె యీచిన్నవాఁడు, ప్రౌఢకవిత రచించి యీశ్వరునిగాంచు
ప్రేమహృదయంబుపుండుగావించియుండుఆజ్యరాహుతిహరునైక్యమయ్యెనతడు

తే. గీ. హృదయమున రేగుపేరిమాగ్నియెవరుపట్టఁ జాలెదరు జీవితపేదాన సమసిపోవు
కాయ మనపాయముగనున్న కొల్పమన్నె ఇంటిగీపంబు చూరున కంటినపుడు.

పిఠాపురము, 27—6—35 | ఇట్లు, ఉమర్ ఆలీషా.

---

## అభినందనపత్రికా.

శ్లో. కోదణ్డపాణికవివర్యమవేలహార్దః సంపూరితో౽నిశమిలాతనుజాపతిస్సః,
కోదణ్డపాణి రవతాద్ధుతదండపాణిభీ ర్భక్తకోటిషు భవాద్యమరార్చితాఙ్ఘ్రిః.

ఉ. చూచితిఁ దావకీనమగు సుందరమౌ నగజావివాహమున్
వే చిరసంభృతప్రమదవీచికల న్మన మాటయాడెడున్
దాఁచి త్వదీయగాత్రి మిటు ధారుణి దర్శన మొందకుండ ని
ర్యాచితమైన కీర్తిని పద్భుతమొందగ నొందితౌబళీ.

తే. గీ. బాలుఁడవు సంస్కృతంబను భాషయందు నాంధ్రమందుననాంగ్లంబునందుగూడ
భాసురంబగు పరిచితి భవ్యకవిత ధారుణి నొందితౌర కోదండపాణి!

ఉ. ధార విశుద్ధగాంగపటుధాటిని వేమఱపించు, శయ్యసం
ధారితసత్పదం, బుచితతాద్భుతకావ్యగుణంబు లెల్ల నొ
ప్పారె, నయారె, త్వత్కృతి, ససాహితిమయ్యెను దోషరాశి యీ
ధారుణి నిట్టిపాత్రము, నతంద్రితఁజేయఁగ నల్పకార్యమే.

క. ఉపమాదియలంకృతులు, న్నపరిమితంబులుగఁ గలిగె నాదృతి నొసఁగన్.
అపరిమితంబగు ముదమును సపరమస్వాభావికోక్తి జొప్పఁడజేసెన్.

తే. గీ. ముద్దుల న్నిను నాడెంపుసుద్దు లలర భవ్యమౌ కృతి సవిధి భావసతికి
నర్పితముఁ జేసి ధన్యుండవైనసికు, కాంతినొసఁగెఁడు గాక శశాంకమౌళి.

తే. గీ. ఇట్లు రేపల్లెపురిని సాంస్కృతిక పాఠశాలవిద్యాంసుఁ డనఘవిశాలబుద్ధి
యైన కోండపాణిసదమలగ్రంథ మొంతయుం బ్రస్తుతించె నాదృతి దనర్ప.

ఇట్లు,
సముద్రాల లక్ష్మణాచార్యులు.
సంస్కృతపాఠశాలాపండితుడు.

రేపల్లె, 25–5–35.

---

క. అయ్యా దయఁ దమ రంపిన, దియ్యైదంకముల పార్వతీ పరిణయముల్
నెయ్యమునఁ జదివితిని మదిఁ, జయ్యనఁ జింతయు ముదంబు సంధిల్లెఁగటా!

క. చిన్నారిప్రాయమున నీ, చిన్నికుమా రునకు నెట్లు నేకురె గుణసం
పన్నత కవితయు బుధజను, లెన్నందగు భావగరిమ మేమనవచ్చున్.

మ. తలిదండ్రుల్ ముదమంద పండితవరుల్ తథ్యంబుగా మెచ్చచుం
దలఁపం దగురీతి వర్తిలుచు సద్యద్గ్రంథకర్తృత్వ మిం
పలరం గాంచఁగ నీ కుమారునకుఁ దా నాయుష్య మీఁడాయెఁగా
నలుమోముల్గల వేల్పు నేమి యిపు డన్నన్ సార్థకం బున్నదే.

గీ. కావ్యములలోన మఱి నాటకంబు రమ్య, మగును నాటకమును వ్రాయు టరయ కష్ట
తరము ప్రౌఢవయోలబ్ధిఁ దగు రచింప, నట్టినాటకమును బల్కె నిట్టి చిఱుత,
పాపఁ డీతఁడు పార్వతీపరిణయంబు.

ఉ. తాతయుఁ దండ్రియుం గవులు తప్పక నట్లను నీతఁడంచు నా
ధాతకు కన్నుగుట్టె నెదఁ దాల్మియుఁ గూర్మియు లేక వీని దా
నీతఱిఁ గొంచుపోయెఁ దగునే యిటుఁ దుఃఖింపఁగ పాప పిండ నేఁ
డీతనితల్లిదండ్రు లెటు లీడఁ గలారు వ్యథాపయోనిధిన్.

క. పుత్రవియోగమునందియుఁ, బుత్రాకృతి వెలుఁగునంచుఁ బుత్రికృతకృతిం
బాత్రిగ నెంచుచు జీవిత,యాత్రను ధృతిఁ గడుపుచార లకటా జనకుల్.

గీ. అల్లి యల్లని తీవియ లలరుచుండ, దొడిగి తొడుగని మొగ్గలతో రహించి
విచ్చి విచ్చని పువ్వులు వెలుఁగుచుండ, వెడలి వెడలని వాసన ల్వెలయ మించి
యలరు లేమల్లియంబోలె లలితభావ,రససమంచితమృదువాక్యరచన మెఱయ
వఱలె వేంకటకోదండపాణిశాస్త్రి, భక్తిఁ బల్కిన పార్వతీపరిణయంబు.

గీ. అబ్బరాజుకులాంభోధి కమృతకరుఁడు, సుమతి వాసుమత్కవీంద్రునిసుతుఁడుసుకృతి
కాంకరీశంకరులమహిమాంకములను, బాలుఁడయ్యు నులించెను భక్తిమీఱ.

గీ. జనకవంశంబునకు కీర్తి సంతరించి, చిఱుతతనమున విద్యల నేకరించి
చిన్నినాటకమును చెల్వచే రచించి, మించి కైలాసవాసియై మెఱయుధీరు
బాలు వేంకటకోదండపాణిశాస్త్రి, యాత్మ కెవ్వేళ ఘనశాంతి యలరుఁగాక
యితనికృతికన్య విఖ్యాతి నెనసి జగతి,నలరి యాచంద్రతారార్క మగునుగాక.

గాంధినగరము, బెజవాడ.

ఇట్లు,
గుడిపూడి ఇందుమతి.

---

చ. సరససరసప్రసారవిలసత్సుమపేశలశబ్దమైత్రి పై
ఖరిఁ దనరారఁగా విబుధకాండ మెద న్ముదమంది మెచ్చఁ దెం
పరియగు నబ్బరాజు హనుమత్కవినందనుఁ డాంధ్రి పార్వతీ
పరిణయ నాటకోత్తమము వ్రాసెను ముద్దులు మూటఁగట్టఁగన్.

క. శివుపెండిలి వ్రాసిన యాకవి వయసునఁ బిన్నవాఁడె కాని కవిత్వం
బవిరళమాధుర్యరసోద్భవ ముట్టిపడంగఁ దనరు బళిబళి యనగన్.

మ. అకటా! యెంతటివాఁడొకో విధి వృథాన్యాపాదియై జాలిఁ బూ
నక విద్యానిధి నబ్బరాజకులచంద్రప్రాయుఁ గోదండపా
ణికవిం ద్రెళ్లఁగఁజేసి దుఃఖమునఁ దండ్రిం దల్లిని న్ముంచె వా
నికి నీలోటులు నుంటఁగాదె పుడమిన్ నిష్పూజ్యుఁడై పోవుటల్.

క. ఈపసిబాలుని సత్కవి,తాప్రావీణ్యంబు రూపతారుణ్యము లే
రేపట్ల మఱపురా విఁకఁ, బాపం బనిపించు నట్టివానికిఁ గట్టా!

తే. గళము నకు వంతనొందుట కార్యమౌనె, యితని యాత్మకృతులు శాంతి యితని తల్లి
దండ్రిసోదరులకు శుభోత్కరము లిచ్చి, ప్రోవు మని రాముఁ బ్రార్థింపఁబూనువాఁడ.

నరసరావుపేట,
24-6-1935.

ఇట్లు శ్రేయోభిలాషి,
మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ.

జాయ్‌శ్రీ కుసుమహరనాథ్

ఉ. దేవుఁడు నేర్పుఁ జూపుచు సుధీరుని గాఁ గవిగా సృజించియున్
గావ నశక్తుఁడై నిను నకాలపుమృత్యువుపాలఁజేసె న
య్యో విధి కేమి లాభము వియోగసముద్రము నిద లేక వా
పోవుచునున్న నీజనకుఁ బూజ్యుని నేగతి నూరడించెదన్.

మ. లలితానందవిశేషదాయకములై, లావణ్యపుందీవియై
పలుచందంబులు సొంపుఁగూర్పు కవితాప్రావీణ్యమున్ జూపు నీ
విలసత్కావ్యము పార్వతీపరిణయం బీనాఁటిగ్రంథంబులన్
దలఁదన్నంగద; నీమృతిన్ గని విధాతన్ దూర కెట్లోర్చెదన్.

గీ. నాకొమరుఁడు చిరంజీవినాముఁ డొక్కఁడుండె నినుబోలునట్టి ఘనుండె దివిని
పదియురెండేండ్ల వయసున భారతమున, కథను జెప్పినట్టి సమర్థుఁ డతఁడు
దైవమును నొక్కత్రుటియైనఁ దలఁపకుండ, నుంపఁజాలని భక్తవరుండతండు
చక్కఁదనమున దేవతాసార్వభౌము, తనయుఁ దలవంపఁజేయు సుందరుఁ డతండు
శాంతశమదమ గాంభీర్యశౌర్యధైర్య, ధర్మగుణయుక్తి సర్వభూతానురక్తి
గలిగి వర్తించు సుజ్ఞానకలితుఁ డతఁడు, కాన సోదరులట్లు నిష్కామప్రేమ
నొండొరులఁ గాంచి మోదంబునొందుఁడయ్యా, దివ్యగుణధామ, కోదండపాణిశామ!

రామనగరము,
బెజవాడ.

ఇట్లు శ్రీకుసుమహరనాథ పదసేవిక,
నందివాడ శేషమ్మ.

# హనుమద్గ్రంథమాలాగ్రంథములు.

1 సుగ్రీవ పట్టాభిషేకము — రు 1-0-0

ఇది నవరసము లుప్పతిల్లు నైదాశ్వాసముల ప్రబంధము

2 అచ్ఛాంధ్రి సిరోష్ఠ్య నిర్గర్వ్య దాశరథిచరిత్రి — 1-0-0

ఇది తెలుఁగు నేర్చుకొనువారి కొక యమూల్యగ్రంథరాజము

3 నందిరాజ లక్ష్మీనారాయణ దీక్షితచరిత్రము — 1-0-0

ఇది స్మార్తబ్రాహ్మణులు నడచు కొనువిధులు దెలుపు మతగ్రంథము.

క్యాలికో — 1-8-0

ఫెదర్వైటుక్యాలికో — 2-0-0

4 నారాయణుఁడు — 0-5-0

5 నీతికథానిధి — 0-5-0

(4, 5: ఇవి వచనములు; బాలుఁరనీతికథలు.)

6 అత్తకోడండ్రి నెత్తము — 0-1-0

7 వాణీశతకము — 0-1-0

8 శ్రీరామశతకము (కొ. సుబ్బకవికృతము) — 0-1-0

9 కోదండపాణి అర్ధశతకము — అమూల్యము

నాపెద్దకొమారునిగూర్చి వ్రాయఁబడినది.

10 భుజంగరాయతారావళి

11 మాఘమాహాత్మ్యము (సావాపత్రి) — 3-00

ఫెదర్వైటు క్యాలికో — 3-0-0

ఇది మాతండ్రిగారైన శేషాచల కవిగారు వ్రాసినది. సమస్తవర్ణాశ్రమధర్మములు మాఘస్నానఫలములు వానిమాహాత్మ్యములు మొదలైనవిషయములు వర్ణించి సుబోధముగాఁ దెలియఁజేయు పురాణరత్నము; సులభమై మృదుమధుర శైలితోఁగూడినది; చదువఁజదువ రుచులూరునది.

12 పార్వతీపరిణయము 5 అంకముల నాటకము — 0-12-0

క్యాలికో — 1-0-0

ఇది నాపెద్దకుమారుఁడు వేంకట కోదండపాణిశాస్త్రి వ్రాసినది. పలువురు సంస్కృతాంధ్రాంగ్ల భాషాపండితులచేఁ బొగడొంది చక్కని గోస్తనీపాకమున నలరారుచున్నది.

13 ఆదినారాయణశతకము — 0-1-0

ఇది మాతండ్రిగారు వ్రాసిరి; భక్తిరసప్రధానమైనది.

☞ వలయువారు:—

అ. హనుమంతరాయశర్మ, ఆంధ్రపండితుఁడు,
బోర్డు మిడిల్ స్కూలు, గురజాల, పల్నాడుతాలూకా, గుంటూరుజిల్లా.

---

శ్రీరామచంద్ర గురుపరబ్రహ్మణే నమః.

# శ్రీపార్వతీపరిణయము.

## ప్రథమాంకము.

(నాంది)



నగవాస! నీదు ఘనశీర్షమునంగల తారకేశ్వరా
నూన రుచిప్రతానమున నూత్నవికాసములా కుముద్వతీ
సూనములం ద్వదర్పనలు చొప్పడునంచు సుధాంశుఁ
దాల్చితో
నా నగజాతఁ జూచి మదినవ్వెఁడు శంభుఁడు మమ్ము నోముతన్!

(నాంద్యంతమున సూత్రధారుఁడు సభికులవంకఁ దిలకించి
కుసుమావళిఁ జల్లి వారలకుం బ్రణమిల్లి)

సూత్ర.—శ్రీమదనంతమహిమాతిశయులారా! శివసేవకులారా!
నేఁడు శివరాత్రిమహోత్సవం బని యెంద ఱెఱింగిన దేకదా?
అందువలనఁ బరమేశ్వర భక్తితత్పరులగు భవాదృశు లెల్ల రిచ్చ
టికి విచ్చేసియుండ నా శివసంబంధమైన యొక్కనాటకం బాడు
టకు, మా కనుజ్ఞనీయ వేడుచున్నారము. (కొంచె మాగి) ఏమీ!
యెవ్వరుఁ బ్రత్యుత్తర మీయఁదలంపలేదా? (ఆలోచన నభిన
యించి) అవసరము లేదు. భవద్వదనారవిందంబులె యుష్మన్మ
నోభిప్రాయంబులు చెప్పకయ చెప్పుచున్నవి. (అని తెరవంకఁ
దిలకించి) నటీ! నీ యలంకారము ముగిసినవెన్క నొక్కమా రిటు
రమ్ము?

ప్రవేశము: నటి.

సూత్ర.—నటీ! వచ్చితివా?

నటి.—ఆర్యా! వచ్చితిని. కాని నన్ను

చం. సకల కలాకలాపులు వి◆శాలమనస్కులు సద్యశస్కులుఁ
బ్రకటరసప్రకాశకృతి◆భాసులు సూనృతభాషు లద్రిజా
స్వకరపరిగ్రహాంఘ్రినవ◆పంకజలోలుపభృంగు లైన యీ
సుకవుల చెంతకుం బిలుచు◆చొప్పెదియో దయ నానతీయుఁడీ!

సూత్ర.—నటీ! యీదినంబునం జరిగిన యుత్సవంబునం గల్గిన యానందంబునం దేలియాడుచున్న యీయార్యబుధసమాజము వా రొక్క నాటకప్రదర్శనమునకై నిరీక్షించుచున్నారు. కానఁ ద్వరలో మన మప్పనిం గావింపవలయు. అందులకై నీసాహాయ్య మవశ్యము గావలసియున్నది.

తే. ఎన్ని యుపకరణము లున్న ◆ నేమి ఫలము
నీవు లేకుంట నేపని ◆ నిర్వహింపఁ
జాలకుంటిని బార్వతి ◆ సరస లేక
శంకరుండు తపము సల్పఁ ◆ జాలనట్లు.

నటి.—ఆర్యా! యీపరిహాసవాక్యముల కేమిగాని, మీ సంభాషణముం బట్టి మన మిప్పట్టునఁ బ్రదర్శింపవలసినది పార్వతీ పరమేశ్వరులం గూర్చిన నాటకం బని తోఁచుచున్నది.

సూత్ర.—ఔను. ఏమి నీ తెలివితేటలు! చెప్పకయే తెలిసికొంటివి.

నటి.—దాని కేమిగాని, యేదీ యా నాటకపాటవంబులు సెలవిండు.

సూత్ర.—రమణీమణీ!

సీ. నవరసాలంకర◆ణములతో నవ్యక
ల్పనలతో మిగులఁ జె◆లంగునట్లు
నూతనశబ్దసం◆జాతసంపదలతో
సర్వసమ్మతమై యె◆సంగునట్లు
'పార్వతీపరిణయ' ◆ భవ్యనాటకరాజ
మును రచించెను బుధ◆మోదదముగ
నబ్బరాజాన్వవా◆యాంభోధిచంద్రుఁడౌ
హనుమంతరాయశ◆ర్మాగ్రసుతుఁడు

తే. బాలకవియగు కోదండ ♦ పాణిశాస్త్రి;
యిప్పు డీ నవ్యరూపకం ♦ బిందు నేర్పు
మీర సర్వజనులకును ♦ మెప్పుగల్గు
నట్లు మనము సంతసమొప్ప ♦ నాడవలయు.

నటి—నటరాజశేఖరా! గ్రంథకర్తగురువు లెవ్వరో నుడువరైతివే?

సూత్రి—సఖీ! యాకర్ణింపుము.

ఆ. జనకుఁ డబ్బరాజు ♦ హనుమంతరాయండు
పోతుకూచి రామ♦మూర్తి శాస్త్రి
యుభయభాష లిడగ; ♦ నొసఁగె వ్యాకరణంబు
* నందిరాజపూర్ణ♦చంద్రిశాస్త్రి.

నటి.—స్వామీ! వీ రీకృతికన్య నెవ్వరి కిచ్చి ధన్యతం గాంచిరి?

సూత్రి.—మనోహారిణీ! వినుము.

తే. రావణనిశాచరేంద్ర గ♦ర్వంబు బాపి
రమణి సీతను గొన్నట్టి ♦ రామచంద్ర
మూర్తికిని సేవ్యుఁడైన శం♦భునకును గృతి
కన్య నిడి పెండ్లిగావించెఁ ♦ గరము బ్రీతి.

నటి.—కృతికర్త పొత్తంపుఁబిత్తరి నిత్తఱి నత్తెల్లనివేల్పగుశివుని కేల హత్తించు టెంతయో పుణ్యంబుగదా?

---

* సంయుతాసంయుతప్రాసము—లక్షణము.

తే. తలలు దమక్రింద జడ్డలై ♦ క్రాలువ్రాలు । ప్రాసవర్ణంబులై వానిఁ ♦ బాసియైన
కూడియైనను బెరయడు♦గులను నిల్చు । సంయుతాసంయుతప్రాస♦సంజ్ఞఁదనరి.

లక్ష్యము.

తే. వాక్త్రినేత్రాంగనాళచీ♦శక్తు లధిక । సంభ్రమంబున శుంభని♦శుంభదైత్య
హంత్రిఁబూజింపుదురు త్రయీ♦మంత్రములను।స్తోత్రములఁజేసిమంగళా♦రాత్రికలిడి.
—దేవీవిజయము.

సూత్ర.—నిజమేకాని ప్రధానకార్యంబును వీడి కావించు నీప్రసంగం బంత సమంజసంబు గాదు. కావున సభ్యు లానందించునట్లు నేదేని యొక్క ఋతువుంగూర్చి పాడుము.

నటి.—ఏ ఋతువుంగూర్చి?

సూత్ర.—ఏదియో యననేల? సకలజనానందదాయకం బగు నీవసంత ఋతువుంగూర్చియే పాడుము.

నటి—

చం. కలువపువుల్ కనుల్ చిగురు ♦ కావిజగాజిగిమోవి తన్మిమ్మపు
వ్వులు వదనంబు మత్తపిక♦పోతవచోమృదుసూక్తి గల్గి శో
భిలు వనలక్ష్మి మాధవుఁడు ♦ పెండిలియై పెనఁగొన్నలీలఁ బొ
న్నలఁ బెనఁగొన్న యేలకుల ♦ నల్వగు నిన్ననకారు చెన్నగున్.

సూత్ర.—నటీ! ఎంత స్వభావసిద్ధంబుగా వర్ణించి పాడితివి. ఇంతటితో నీప్రసంగంబుఁ జాలించి నాటకోచితపాత్రింబుల సిద్ధపఱుపుము.

(తెరలో)

శా. రక్షింపంగను శిక్ష సేయఁగను భా♦రంబూనియున్నట్టి నీ
వక్షయ్యుండవటంచు నెంచక, యనా♦యాసంబుగా మేమె పో
మోక్షంబీయగ సర్వకార్యముల సం♦పూర్ణంబుఁ గావింపఁగా
దక్షాధ్యక్షులమంచు నెంచుఖలులం♦దండించు మోయీశ్వరా!

(శ్రుతి నభినయించి) అరుగో! ఎవ్వరో మును లీశ్వరసందర్శనార్థంబు వచ్చుచున్నారు. కాన మన మిట్టియెడ కర్తవ్యాంశము విచారింతము. పోదము, పద.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



ప్రథమరంగము - కైలాసము - శివమందిరము.

(ప్రవేశము : నారదాదిమహర్షులు "రక్షింపంగను-" అను పద్యమును జదువుచు)

(శివుండు బ్రహ్మావలోకనంబున సమాధినిష్ఠలో నుండును.)

నార—దేవా! కైలాసవాసా! చిద్విలాసా! భక్తజనహృదయారవిందమందిరా! గరళకంధరా! దాక్షాయణీప్రియభాజా! కోటిమార్తాండతేజా! గంగాజలసిక్తజటాభారా! వరశివార్ధశరీరా! నమస్తే నమస్తే నమస్తే.

(అని నమస్కరించును.)

వశిష్ఠుడు.—

తే. దక్షజామాత! మాకు నీ • దర్శనమున
సర్వకలుషాళి వాసెను • సాంప్రతంబు
నీదుమూర్తిని నాయెద • నిల్పికొల్తుఁ
గానఁ గరుణను వీక్షించి • కావు మీశ!

వామదేవుఁడు.—

ఆ. వె. ఈశ! నీదుకృపను • నేత్రంబున లోని
శత్రుబాధ లేదు • చర్చసేయ
దండ మిదిగో కొనుము • దండఁ జేరిన నన్ను
నెటులఁ బ్రోతువో య • హీశభూష!

నార—ఓహో! మహాదేవుఁడు సమాధినిష్ఠలో నున్నట్లు చూపట్టెడి. కావఁబట్టి కొంతవట్టు వేచియుందము.

ప్రతీహారి.—(ప్రవేశించి) స్వామీ! యుష్మచ్ఛ్వశురుండగు దక్షప్రజాపతిగారు ద్వారంబున నిలిచియున్నారు.

నార—సత్వరంబునఁ బ్రవేశపెట్టుము. (దక్షుఁడు ప్రవేశించును.)

దక్షు.—(ప్రతీహారి కనుజ్ఞ నిచ్చి) నాయల్లుండగు శివుండు నన్ను నమస్కారపురస్సరంబుగ నెదుర్కొనలేదేలొకో? (కారణ మార

యక కోపముతో మునీంద్రులారా! అవలోకించితిరిగదా యీదుశాగతము? ధర్మపక్షంబునం జూచిన నీతండు నాదు హితుండై నా దుహితం బెండిలియైనప్పటినుండియు నే నీతనికిం గురుసమానుండనుగదా! ఈతండు ధర్మమూర్తి యనియు, సర్వ దుష్టసంహారకుం డనియు, శిష్టజనాదరుం డనియుంగదా మీ రందఱు సతంబును హితంబునఁ గొల్చుట? ఏదీ! ఆధర్మరక్షణం బెక్కడ డాగినది? చూపింపుఁడు! అదియునుంగాక; పరమయో గీంద్రులైన భవాదృశు లందఱుంగూడ నెంతయో సంభావింపు చుండ గర్వాంధుండై తాను నన్ను సత్కరింపలేదుగదా?

నార.—దక్షా! అది నిజమే! కాని సర్వలోకైకపూజితుండగు నీమహేశ్వరుండు సమాధినిష్ఠం గూడియుండుటంజేసి నిన్ను సత్క రింపకపోయినను నీవింతలో నింత యాగ్రహంపడు టుచితంబు కాదు.

దక్ష.—నారదా! నీ వేమో మంచివాఁడవు, ధర్మాధర్మవిచారణుండ వనుకొంటిని. కాని కలహభోజనుండ వనియు, శివపక్షపాతి వనియు జ్ఞప్తికి వచ్చినది కాదు.

నార.—నీశైవానాదరణసంజాతవైరాగ్నివలన నాయొక్క భగవ న్నామస్మరణధారణాశక్తులు బూడిదపాలైనవి కాఁబోలు!

దక్ష.—నారదా! ఇంక నూరకొనుము. నీమనోభావ మంతయుఁ దెలిసినది. ఎటువంటివారి కటువంటివారే సేవకు లగుదురు. (శివుఁడు సమాధినుండి మరలును.) (శివునివంక దృష్టి సారించి) ఓయీ! జామాతా! ఇప్పటికి నీమనోనిశ్చయం బంతయుఁ దెలిసి నది. ఇంక నీతో నాకుఁ బనిలేదు. అదియునుంగాక,

ఉ. ఇంచుకయైన సంపదల • నేనియుఁ జూడక, దుర్గుణంబులం
గాంచక, సద్గుణంబులనె • కాంచియు నాదగు కూర్మిబిడ్డ రా
యంచ కనుంగు నెన్నడలో • యారముమీరఁగ నేర్పుదాని, లో
నించుకృపావిశేషమున • నీ కిడ న న్నిటు చుల్కఁజేసెదే!

మఱియు,

తే. గీ. బుస్సుమను పాముసొమ్ములు • బూదిపూత
కోఁకలుబూతాలనేఁతలు • గోచిపాత
కాటియునికియుఁ బుట్టె కేల్ • గల్గువాని
కెవ్వ రిత్తురు కన్నియ • నేనుగాక.

అంతమాత్రమైన గారవము లేకపోయెఁగదా? ఎంతగర్వాంధుండవైతివి? ఔరా! కాలమహిమ!

శివు.—ఆర్యా! గడచినదానికిఁ జింతించినఫలం బేమి? తాము వచ్చినప్పుడు బ్రహ్మానుసంధానంబునం దుండుటంజేసి యట్లు జరుగవలసివచ్చె. ఇంతమాత్రమున కాగ్రహించితిరే? శాంతస్వాంతంబున రవ్వంత గాంచవలదా?

దక్షు.—సాంబా! నీ వింక నెన్నిక్షమాపణలు కోరినను నీకోర్కె ఫలింపదు. 'అందినఁ గేశంబులు నందకున్నఁ బాదంబులునా?' మొదట నన్ను సత్కరింపక, నాతో మాటలాడక, కలహాశనుండగు నారదుని వారింపక యిప్పు డిట్లు మాట్లాడిన కార్యంబు ఫలించునే? ఇంక లాభంబు లేదు. ఈదినంబునుండి నీవును నీభార్యయుంగూడ సుఖంపుఁడు. మాతో మీ కేమియు నవసరంబు లేదు. మీతో మా కేమియు నక్కఱ రాఁబోదు. (మునుల వైపుఁ దిరిగి) ఆర్యులారా! ఇదిగో నాప్రతిజ్ఞ వినుండు. నే నింక నీయవమానంబు సహింపఁజాల. అంతకుముం దీతనిముఖంబు జూడఁజాల. (అని యల్లునివైపు దిరిగి)

* ఉ. వచ్చిన పెద్దవారలకు • వందనముం బొనరింపనట్టి నీ
పిచ్చికి మెచ్చుకొంటి నిఁకఁ • బిల్ల నొసంగిన మామనాటచేఁ
గచ్చును డించి కొద్దియప • కార మొనర్చెద, హవ్యవాహుఁ డం
దిచ్చెడి హవ్యభాగములు • నీ కిఁక మీఁదట లేకపోవుతన్.

---

* తే. గురుసమానుండ నగు నన్నుఁ • గూర్మి మీఱ
సత్కరింపక నీ వల • క్ష్యముగ నుంటి
కాన 'మఖముల హవ్యముల్ • గాంచకుండు
గాక యిప్పటినుండియుఁ' • గాలకంఠ!

ఇదిగో! నాశాపం బమోఘంబు; దీని ననుభవింపుము.

(నిష్క్రమించును.)

శివు.—నారదా! చూచితివా! ఎంతపని జరిగినదో?

నార.—దేవా! దీని కాతండు తగినఫలం బనుభవింపకపోఁడు లెండు. (ఆకసమువంకఁ జూచి) అదుగో, మార్తాండుండు గగనమధ్యంబున సంచరించుచున్నాఁడు. ఏతత్కాలోచితకృత్యంబులు నిర్వర్తించు కొందుము; మాకు సెలవిండు.

శివు.—తపోధనులారా! వెళ్ళిరండు; కానున్నది కాకమానదు.

(నారదాదులు నిష్క్రమింతురు.)

శివు.—(తనలో) కటకటా! ఎట్టి కాలవైపరీత్యము దాపరించినది! నా మనశ్శాంతి కిదియ ఫలంబు కాఁబోలు. సరే కానిమ్ము! ఇప్పు డనుకొనిన నేమిఫలము? ఇంకఁ గాలోచిత నిత్యకృత్యంబులం దీర్చుకొని దాక్షాయణియొద్ద కేగెదఁగాక.

(నిష్క్రమించును.)

(తెర పడును.)

---

[ద్వితీయరంగము - కైలాసోద్యానము.]

(దాక్షాయణి, శివుఁడు ప్రవేశింతురు.)

దాక్షా.—నాథా! అటు చూడుము. ఆ కోకిలాలాప విలాసంబు, నా సముత్ఫుల్లనీపకుసుమకదంబంబు, నాకిలసయ తల్పంబుల ననల్పసౌఖ్యంబులం గాంచు కలరవారావంబు, నాశతపత్రమధ్య మధురసం బాను భృంగీనినాదంబు క్రొత్తగ నొక్కశోభను నీవన లక్ష్మికిం గూర్చుటలేదా?

శివు.—సతీ! యియ్యవసరంబున నా కెవ్వియుఁ గాఁబట్టియుండలేదు.

దాక్షా.—ప్రాణనాయకా! మీ వచనంబులు చిత్రంబులుగ నున్నవే ఇట్టి వనలక్ష్మియొక్కశోభ మీ కానందదాయకంబు గాకుండ

టేల? ఇందుల కేదియో కారణం బుండితీరవలయు. (ఆకసము వంకఁ దిలకించి) నాథా! అటు పైకి విలోకింపుఁడు. (పైపైపు చూపి) వారు సెప్పకొనెడి మాటలు వినుఁడు.

శివు.—(చెవి యొగ్గి వినును.)

(తెరలో)

తే. అఖిలసురభోగ్యమైన పుణ్యంబు గలుగు
దక్షయజ్ఞంబుఁ గనఁగోనఁ దరలువారె?
ఓ శచీపతి! యో యగ్ని? యో పితృపతి!
కలయుఁడీ! వేగ పోవంగవలయు నటకు.

దాక్షా.—వింటిరా? నాథా!

చ. కులిశధరాదు లల్ల నలకూబరముఖ్యులు, సర్వమానులుం
గలిసి, నిజాంగనాయుతముగాఁగను నాదగుతండ్రిలోగిటం
జలిపెడు జన్నముం గనఁగ సాగిరి దానిని నగ్గడించుచుం,
సొలయక వేగఁ బోవుదమె? సోమకలాధర! సత్కృపాకరా!

శివు.—సఖీమణీ! నిజమేకాని "పిలువని పేరంటమునకు" మన మేలాగునఁ బోవంగలవారము?

ఇట్లు మనల నాహ్వానింపకయె తాను యజ్ఞంబు నల్పుటకుం గూడ నొక్క హేతువు కలదు. చెప్పెద వినుము. ఇంతకుముం దొకనాటి యుదయమున నేను బ్రహ్మానుసంధానంబున నుండ నారదాదులు వచ్చి పరివేష్టించి వేచియుండిరి. అంతలో నీజనకుం డచ్చటికిం జనుదెంచినాఁడఁట.

దాక్షా.—(ఆత్రముతో) వచ్చినాఁడా! నే నవలోకింపకపోయితి నే?

శివు.—అప్పుడు నే నయ్యనుసంధానంబునం దుండుటంజేసి వారి నాదరించుటకు వలను పడదయ్యె. తత్కారణంబున నొక్కనిమ్మేషంబున నే క్రోధానల పూరితహృదయుండై 'ఋషిసాక్షికంబుగ నీకును, నీభార్యకును, నాకును నేఁటినుండి ప్రేమలతానుబంధంబు

తెగిపోయిన' దనెను. మఱియు 'మన బంధుత్వంబు బాసినది' యని శపథంబునుజేసిచనిరె. అదియునుంగాక 'యజ్ఞంబుల నీహవ్యంబులు లేకుండుఁగాక!' యని శపియించియును వెళ్ళెను. నాటంగోలె నాపై నతనికి వైరంబు కలదు. అది యటుండనిమ్ము. ఇప్పుడు నిన్నైన పిలువలేదుకదా? ఎట్లు పోయెదవు?

దాక్షా.—కటకటా! నేనింక నా జనకుని దర్శింపఁ బోవలనుకాదుగదా? ఇంక నా జననియైన నన్నక్కునం జేర్చదుగదా? నా తండ్రియైన నంతలోనే యేల కుపిద్ధుండు కావలయు?

శివు.—దాక్షాయణీ! నేను క్షమింపుమని యడిగికొనినను నతఁడు కోపం బుడుగఁడయ్యెను.

దాక్షా.—(తనలో) జనకా! ఎంతపని గావించితివయ్యా! నాయందింతకరుణ వీడితివా? చిన్ననాఁటనుండియు నీ కెంతయో ముద్దుగొల్పుచున్న నేను, నీకిప్పటికి విరోధినినైతినా? ఆహా! కాల వైపరీత్యము! కోపంబువలననేకదా యెందఱో కూరిరులై చెడిరి. నీకును నా పిశాచమే పట్టినదా? నీ రాజ్యతంత్రంబులం గల బుద్ధి చాతుర్యము, నీ కార్యాకార్య విచక్షణతయు నా సమయంబుననే యడుగంటినవా? జామాతృదోషంబు క్షమాపణనైన నేయవైతివిగా? (ధైర్యమభినయించి, (ప్రకాశముగ) నాథా! ఇంక నే నీ వియోగ దుఃఖభరంబు భరింపఁజాల. మీ కాతఁడు విరోధియైనఁ గానిండు; మనల నిప్పు డాహ్వానింపకపోయినఁ బోనిండు. తనూజాతనని నాయం దేమాత్రంబైన ప్రేమలవము లేకుండునా? అదియునుంగాక మీ కంటెఁ బెద్దవాఁడు, శ్వశురుండు. ఒకవేళఁ గోధమగ్న మానసుండై యా సమయంబున నట్లు పలికెంగాని యిప్పుడు వోయిన మనల నాదరింపక పోఁడు. ఇందు మన కేమియు నష్టంబు లేదు. కావున మన మిప్పుడే వెలువడుట మంచిదికదా?

శివు.—(కొద్దికోపము నభినయించుచు) సఖీ! పెద్దవాఁడైనఁగావచ్చు. దాని కేమి? ధీమంతులకు సైతము ప్రమాదము కలుగు నని ప్రాజ్ఞులు పలుక వినలేదా? అట్లై తప్పు సంభవించినది. కాని

తజ్జనితోఁగ్రిత్వంబునఁ గన్నుఁగానక యెన్నియో కాఱులువల్కె. ఇంక నాతఁడు సెప్పినట్లు నాకును నాతనికిని సంబంధము లేదు. నీ కింకను నాతనిభావంబు బోధపడలేదు కాఁబోలు?

దాక్షా.—ప్రాణేశా! నా జనకుని వచనంబుల మనంబున నిడికొని మీ రిట్లు మాటలాడిన సమాధానంబు సెప్ప నే నెంతటిదానను? నా కాతనియం దింతవరకు నన్నాదరించుననినమ్మక మున్నది. కాన నొక్కదివసంబులోఁ దిరిగి రాఁగలను. నాకైనఁ బోననుజ్ఞనీయ వేడు కొనుచున్నాను. ఈ కోర్కిం దీర్చి యానందవార్ధి నోలలాడిం చెదరో; లేక దుఃఖాంధకారకూపంబునఁ ద్రోయించెదరో; మీ యిచ్చవచ్చినట్లు కావింపుఁడు.

శివు.—(తనలో) ఈపె కింకను ప్రేమలత విచ్ఛిన్నము కాలేదు. సరే! జరుగవలసిన యవమాన మెట్లు జరుగకతప్పును? నేను వారింపరాకున్నది. కావున ననుజ్ఞ నిచ్చెద. (ప్రకాశముగ) దాక్షా యణీ! కానిమ్ము, పోయిరమ్ము. భవితవ్య మెట్లు జరుగనున్నదో? ఎవ్వ రేమి చేయఁగలరు?

దాక్షా.—సంతోషము! సంతోషము! వాయువేగంబున గగన మార్గంబున నిప్పుడ ప్రయాణమై యచటకుఁ జేరెదఁగాక.

(నిష్క్రమించును.)

శివు.—సర్వజ్ఞత్వము గల మగవాఁడయినను నాఁడుదానిమాటఁ ద్రోసి పుచ్చఁజాలఁడుకదా?—కాత్యాయని వెళ్ళినది. అట నేమగునో చూచెదఁగాక. (అని నిష్క్రమించును.)

---

ఓ వ రంగము - శివమందిరము.

(శివుఁడు, నారదుఁడు ప్రవేశము.)

శివు.—ఎట్లు? నారదా! ఉదయమున నే వెళ్ళినది. నా ప్రియపత్ని కేమైన పుత్రికావాత్సల్యంబున సన్మానంబె జరిగినదో లేక నిర్మా

హంబున నవమానంబె జరిగినదో? ఇంతవరకు నే వార్తయుఁ దెలియలేదేమి యని యనుమానించుచునే యుంటిని. ఏమి జరిగినది?

నార.—దేవా! ఏమని విన్నవింపను?

శివు.—ఏమి నారదా! అట్లంటివి? మఱియు దీనముఖంబున నుంటివి! ఏదేని శోకమూలంబైన వార్తను వింటివా యేమి?

నార.—ఈమంద భాగ్యుండు వినుటయేకాదు- కనుటయుఁగూడఁ జరిగినది. నా త్రిలోకసంచారంబున కిదియ ఫలంబు కాఁబోలు!

శివు.—నారదా! దాక్షాయణి కెంతపని జరిగినది! నన్ను నిందించిన నిందించెఁగాక; కన్నకొమరిత యనియైనఁ దలంపకపోయెఁగదా! మాతాపితృదులైన నెవ్వరు నాదరింపలేదా?

నార.—ఎవ్వ రాదరింతురు? రాజాజ్ఞ నెవ్వ రుల్లంఘింపఁగలరు!

శివు.—తరువాత తరువాత!

నార.—ఇంక నేమున్నది? మాదృశు లెందఱో యోదార్చిరి. లాభము లేకపోయెను. ముఖ్యముగా నే నెంతయు మిక్కుటంబుగ నాకసులనేత్రను మీ యొక్క సమీపమున విడిచెద నని పెక్కు రీతులఁ జెప్పినను వినక యనాదరణలజ్జాభరంబు మోయంజాలకుంటి నని చెప్పి స్వకీయపరిభావంబున గల్గిన యోగాగ్నిం బడి ...(చెవులు మూసికొనును.)

శివు.—చెప్పుము! చెప్పుము! ఏమైనది? (ఆలోచించి) ఇం కేమగును! హుతాశనకీలలకు హవ్యం బయ్యెఁగాఁబోలు? ప్రాణేశ్వరీ! ఇంక నన్నెప్పుడు కలిసికొందువు? ఇంక నీతో సుఖించు భాగ్యమున్నదా! ఏమి? ఇఁటనుండి నేను తాళంజాల. (అని కన్నీరు నించును.)

నార.—శంకరా! ఊరడిల్లు మూరడిల్లుము. సర్వధర్మవిదుండ వగు నీవే యిట్లు విలపించిన నిన్నోదార్పఁగలవా రెవరు? ఇంకఁ గాఁగలకార్య

మెట్లు నెరవేరును? మఱియు నామె యోగాగ్నిం బడుచు నీతో నిట్లు సెప్పుమని వక్కాణించె వినుము.

సీ. భర్తాజ్ఞమీరిన • పడతికి నిటువంటి
పాటులే కలవని • చాటె ననుము
ముందు రాఁగల జన్మ మం•దైనఁ దన్నె వి
వాహమాడదనని • వల్కె ననుము
అనవరతం బీశు • నాత్మను మననంబు
సలుపుచుండెద నటంచుఁ • బలికె ననుము
అంగంబు నగ్నికి • నప్పనం బొనరించు
తరినైనఁ బతి నెద•మరువ ననుము

తే. గీ. తన్ను నెడబాసి వచ్చియుఁ • దండ్రిచేత
నాదరణ మొందకుంటచే • నావమాన
భరము మోవంగఁజాలక • బాడబులకు
నెదుట విడిచెదుఁ బ్రాణంబు • లివియె యనుము.

శివు.—హా! ప్రాణనాయికా! ఎంత ఘోరకృత్యం బాచరించితివి? ఆయయ్యతనయయే యనిపించితివే? శాంత మిసుమంతయైన వల దా? నారదువచనంబులయందైన గౌరవం బుంచకపోయితివిగదా? (అని నారదువంకఁ దిరిగి) ద్రుహిణనందనా! ఈదక్షుండు నా హృదయక్షేత్రమున నాటి పోయిన వైరంపుమొలక యిదివఱకే యేపుగఁ బెరుగుచున్నది. ఇప్పు డీసతీమరణవార్త వినుటంజేసి బాగుగా నభివృద్ధిచెంది శాఖోపశాఖలు దాల్చి మహావృక్షమై ప్రబలినది. ఇంక దీని నాతండు తెగఁగొట్టఁజాలండు. ఇదిగో యిప్పుడే యాతని నీవృక్షఘాతంబునఁ బరలోకంబున కనుపక మాన. వాఁ డెంతకుసాహసించెను! అస్మజ్జటాజూటకేశ ఝూటమా!

మ. తనయాద్వత్కృతయజ్ఞదర్శనమహా•త్సాహాముదంబొప్పగా
గని మర్యాదలు నేయమాని యిటు యో•గాగ్నిం బడంజూచె నా

ఘనమత్తాత్ముఁడు, దక్షుఁ డాతనిశిరః ఖండంబులం గాకగృ
ధ్రినికాయంబు భుజింపఁజేయ గల భద్రిస్థేము సృష్టింపవే!

(అని తలపైని జటను దూసి నేలపైఁ గొట్టును.)

(తెరలో)

(దుందుభులు మ్రోగును.)

(వీరభద్రుఁ డావిర్భవించి వచ్చి)

తే. బాలచంద్రధరా! జటా పాతముునన
యుద్భవించితి నెంతయే నుక్కుతోడఁ
గాన నిద్దానికిం గల కారణంబు
నానతీయవె నా కిపు డభ్రికేశ!

శివు.—వీరభద్రా! ని న్నొక్క మహాకార్యంబునకై సృష్టి గావిం
తిని. అద్దానిని నీ విప్పుడ యాచరింపవలయు.

వీర.—తండ్రీ! అవశ్యము దేవరయానతి శిరసా వహించి యక్కా
ర్యము నిర్వహించి కృతార్థుఁడ నయ్యెద, సెలవిండు.

శివు.—భద్రా! నేఁ జెప్పున దేమున్నది. ఇటు రమ్ము. అంతయు
నీవె తెలియఁగలవు. (అని చేరఁదీసి కనులు దుడుచును.)

వీర.—(నూతనావేశముతో) ఆ! తెలిసినవి, దక్షుని దుండగములు.
కూతుమరణమునకైన నొప్పుకొని, విరోధము సాధించు నాదు
ష్టాత్ము గర్వం బడంచెద. ఇప్పుడ పోయి యాదక్షాధ్వరధ్వంసంబు
గావించి వాని నంతం బొందించి యథాస్థానంబు నేరెద.

శివు.—వీరభద్రా! విజయోస్తు, విజయోస్తు; వెళ్లిరమ్ము.

వీర.—చిత్తము. ప్రమథగణంబులతో నిదె యరుగుచున్నాఁడ.
ఇక్కడ తిరోహితుండనై యిప్పుడ యక్కడి కేగెద. (అని నిష్క్ర
మించును.)

నార.—దేవా! ఆదక్షున కిదియే తగిన ప్రాయశ్చిత్తము.

శివు.—నారదా! నాయర్ధాంగలక్ష్మియైన దాక్షాయణిలేని నాగృహ స్థాశ్రమం బెందులకు? నే నేగి తపం బాచరించుకొనెద. భద్రుం డు కార్యంబు సాధించుకొని రాఁగలండు. మనము పోవుదము, పద.

(అని యిద్దఱు నిష్క్రమింతురు)

---

4, వ రంగము - దక్షమందిరము.

(దక్షుఁడు బ్రహ్మాదిఋత్విగ్గణంబుతోఁ బ్రవేశించును.)

దక్షు.—బ్రాహ్మణులారా! ఋత్విక్కులారా! మీరు మీపనులయం దప్రమత్తులరై మెలంగుఁడు. నేను కృతస్నానుండనై యరుదెంచువాఁడ.

ఋత్వి.—సరే కాని, దక్షా! ఏమిది? యీయయహంబునఁ దిమిరపటలావృతంబై నట్లు దిగంతరాళంబు ధూళిపాళిచేత వ్యాప్తమైనదే! (శ్రుతి నభినయించి) ఏ మీభీకరనినాదంబులు? చెవులు చిల్లులు వడుచున్నవే! ఏమి, ఏకారణంబును దోచకున్నదే!

శా. ఘోరంబై చెలఁగె న్మహాధ్వనులు, సంకోచంబుగాంచె న్మనం
బౌరా!స్రుక్స్రువముల్ చ్యుతంబులగుచుం హస్తంబుల న్నిల్వ వ
య్యారే! మేను వడంకసాగె, బ్రళయంబా? లేక దుష్టుల్ నిలిం
పారతుల్ పచరించుకృత్యముల? విప్రశ్రేష్ఠ! చూడంగదే!

దక్షు.—అయ్యలారా! మీ కేమియు భయములేదు. భవత్కార్యమగ్నులరై యుండుఁడు. దాయ లెవ్వరైన దండెత్తుచున్నారేమో యనుకొన్నను దండధరులం బోలి దండంబులం దాల్చి మనదండను సేనానాయకులపిండు నిల్చియేయున్నది. ఇంద్రుఁడైన గానిండు, బ్రహ్మవిష్ణ్వాదులైన రానిండు. తుద కమ్మహేశ్వరుండైన నాయందలి వైరంబున నరుదేరనిండు. మీరేమియు భయంపడఁ బనిలేదు. మీ కెవ్విధంబైన యపాయంబును రానేరదు. కావున మీరు మీ యాగకృత్యంబుల వీడకుండుఁడు.

2. బ్రా.—(భయమునభినయించుచు) దక్షా! నీవెంత ధైర్యంబు సెప్పినను మామనంబులు కుదుటఁబడుటలేదు. అదియునుంగాక, యిటు చూడుము; ఈచండవాతవాతంబులు. సర్వయజ్ఞోపకరణంబులు గొట్టుకొని పోవుచున్నవియే? మరియు-

తే. గీ. చండవాతాదు లివిగో దుశ్శకునము లివె
వీని నీక్షించుచుండియు ♦ వీడుఁ డింక
భయ మటంచును బల్కఁగా ♦ ఫలము గలదె?
తాళఁజాలము వీనికి ♦ దక్ష! నేఁడు!

(వీరభద్రుఁడు ప్రమథగణములతో సింహనాదము సేయుచుఁ బ్రవేశించును.)

బ్రాహ్మణులు.—దక్షా! భయము. భయము.

దక్షు.—ఇదిగో! తాళుఁడు. తాళుఁడు. శాతాళిని వైచుచున్నాఁడ.

(అని నిష్క్రమించి తిరిగి ప్రవేశించును)

1 బ్రా.—ఎవ్వఁడావచ్చువాఁడు?

సీ. ఎవ్వండొకో యాతఁ ♦ డేణాంకధరుఁబోలి
బూదిని మెయినిండఁ ♦ బూసినాఁడు,

2 బ్రా.—ఎవ్వం డొకో యాతఁ ♦ డీశానునింబలె
నొకటిగా జడముడి ♦ నుంచినాఁడు,

3 బ్రా.—ఎవ్వం డొకో యాతఁ ♦ డీశుఁ బోలఁగఁ గేల
ముమ్మొనవాలును ♦ బూనినాఁడు

4 బ్రా.—ఎవ్వం డొకో యాతఁ ♦ డిభచర్మధరుఁడయి
ప్రమథులతోఁగూడి ♦ వచ్చినాఁడు

(ఆలోచన మభినయించి)

1 బ్రా.—ఆ. వె. ఎవ్వఁడో యనంగ ♦ నేల? యాయీశుఁడే
యితని సృష్టిఁజేసి ♦ యిచటి కిటుల

బంపియుండవచ్చు ♦ ప్రాణంబులం గావు
మయ్య! యిప్పుడైన ♦ నియ్యకొల్పి.

2 బ్రా.—ఓదక్షా! ఇంకనైనఁ దెలిసినవా యింతఁదనుక మన భీతి హేతువులు? నీయందు నాయిందుధరునికిం గలవైరం బంతయు నీ రూపంబునఁ బరిణమించినట్లున్నది. ఎంతపనిఁ జేసితివి? సాహసంబున నాపినాకపాణికి శాపంబొసంగి, యావైరంబు కారణంబుగ నాతని నాహ్వానింపకయ జన్నంబు మొదలిడితివి. అదియునుంగాక తత్ప్రాణప్రియయైన యార్యను, దనూజ యనిమైన నెంచక యవమానించితివి. "సహసా విదధీత నక్రియామ్" అనునార్యోక్తి నీయెడ లక్ష్యసమన్వితమయ్యెఁగదా? ఇంక లాభంబులేదు. ఇప్పట్టునైన నమ్మహాదేవు నపరమూర్తియైన యీ మహాపురుషు నాశ్రయించి భక్తిచేతం బూజించి శాంతింపఁజేసితివా, మనయసువులు నిల్చును. లేకపోయిన నాసలు పాసి పోవలసినదే. ఇంకనీయిష్టము.

దక్షు—ఋత్విగ్గణంబులారా! బ్రాహ్మణజనంబులారా! ఇదిగో! నా పరాక్రమంబు వినుండు.

శా. ఈశుండేని, దిగీశుఁడేని మును దం ♦ డెత్తంగరా నాదుదోః
పాశద్వంద్వముచేత సాహసమునం ♦ బంధింపనే? యట్టిచో
నైశంబా నవతార మన్నభయ మేఁలా మీకు? నం జూచెదో
యాశల్ వీడుచుపారుఁగాక యికఁ గ♦య్యంబాడఁగా నిల్చునే!

నేను తనకడకు నేతెంచిననాఁడు మహామునిపురస్సరంబుగ నన్నుం గౌరవింపకుంటయెకాక నాయెడ వైరం బూని నాపై కీపిశాచమూర్తినిఁ బంపునా? ఇట్లు గావించుట కీలికీలాళిపై శలభాళిని మునరంజేయుటగాదె? పోనిండు, వచ్చినవచ్చుఁగాక, నా కేమి? జరుగవలసిన తీరున జరిగియే తీరును.

వీర.—(తనలో)

సీ. విస్ఫులింగంబులు ♦ విడజూచితినయేని
ప్రళయకాలాగ్నికీలా♦ప్రభలు గురియు

వికటాట్టహాసంబు ♦ ప్రకటించితిన యేని
బ్రహ్మాండభాండముల్ ♦ పగులువారు
నూరుపాదంబులు ♦ నుగ్రతం దట్టిన
ధరణి యుఱ్ఱూతల ♦ దద్దరిల్లు
ఘనముష్టిఘాతంబు ♦ గావించితిన యేని
కుధరంబు లదరిగ♦గ్గోలువడును
తే. లలిని నాగ్రమోల నిలువఁగ♦లాఁడు విష్ణు
వ్రతయంబున లేఁడు మ♦త్ప్రబలధాటి
దక్షు గిక్షుని లెక్కగఁ ♦ దలఁపనేల?
యాతఁడెటుచేయునో మఖం♦ బరయువాఁడ.

ఆహా! స్వప్రతాప మదాంధుండవై నాకే ముప్పువాటిల్లఁ జేయనుంటివా? నీకు రాఁబోవు విపత్తునకై విచారింపవు కాఁబోలు? ఇదిగో యిప్పుడే నీగర్వ మడంచెదఁగాక.

(తెరలో)

మహారాజా! రక్షింపుఁడు! రక్షింపుఁడు! ఎవ్వండో భూతేశుం బోలి మారుధిరంబుఁ ద్రావుచున్నాఁడు. రండు — రండు.

దక్షు.—(వినుట నభినయించి) ఇదిగో వచ్చుచున్నాఁడ. ఆగుఁ డాగుఁడు.

వీర.—(గుడ్లుఱెఱ్ఱఁజేసి) శివాపరాధీ! దక్షా! నిలు నిలు.
శా. ఓరీ! సర్వజగన్నియామకుని ధీ♦రోదాత్తునిం జిత్కళా
పారావారుని సంగవర్జితుఁ గృపా♦పారీణు గారీధవుం
గారుల్ పేరిలి శపించివచ్చిన మహా ♦ కష్టాత్మ! నీకంతమున్
ఘోరాసిం దునుమాడి గ్రద్దలకు విం♦దుల్ సేసెదన్ నిల్వుమా!

ఇం కెక్కడికిఁ బోయెదవు? నాచేతులలోఁ బడితివి లెమ్ము. నీ ప్రతాపంబు నంతయు నొక్కనిమేషంబున రూపుమాపెద. నీశాప ఫలం బిప్పుడ యనుభవించెదుగాక. శివావమానభాజనంబైన యశివమఖం బశివంబే యగుఁ గాని యీశివపుత్రుం డుండఁగా

సాంతంబుగ నెరవేరునే? ఇంకనెట్లు నీయజ్ఞపరిసమాప్తిగావించె దవో విలోకించెదఁగాక. శివదూషణంబువలని ఫలం బిప్పుడే యనుభవించెదుగాక.

ఇదిగో! యిటుచూడుము —(శూలం బెత్తి)

ప. ఉరుశాతాసిని బట్టివచ్చినను సింహహోదగ్రసైన్యవ్రజం బరయందెచ్చిన నాదుశూలమునకాహారంబు నిండారునే!

దక్షు.—అరుదామద్భుజవిక్రమం బెఱుఁగ, వాహా! నన్నుడీకొన్ననీ బరలోకంబున కన్పవాఁడ నిపుడే మచ్చూలఘాతంబునన్.

(అని శూల మెత్తును.)

వీరభద్రా ! మత్త్రిల్లియున్న నీసత్త్వం బరీక్షించెద.

వీర.—కానిమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు.)

బ్రహ్మ.—స్వామీ! ప్రజాపతియు, దీనాననుండు, వాజపేయ యజ్ఞకర్తయు నగు నీదక్షుఁ జంపవలదు.

వీర.—మీాయజ్ఞకర్తయందు మీా కింత విశ్వాస ముండిన నాఁడు శాపా వసరంబున నీతఁ డాడినదురుక్తులు మీాకు యుక్తమని తోచినవా? ఇంక నీతని కవసానకాల మాసన్నమైనది. ఊరకుండుఁడు.

బ్రా.—మన మీాఘోరకృత్యము గాంచలేము. వెంటనే పోయి మం త్రివర్గమున కెఱింగింతము రండు.

వీర.—దక్షా! నీవు గావించిన శివాపరాధంబునకును, దక్కంగల దుష్కృతంబులకును నొక్కమారే తగినఫలం బనుభవించుచు న్నాఁడవు, చూడు మిదిగో నాశూలము. నీకంఠంబు తెగినది, చూడుము. (అని తెగవేయును.)

(తెరలో)

హాప్రజాపతీ! హాయజ్ఞపతీ! ఇంతలోనే మమ్ముల వీడిపోయితివా? ఇంక నీసోకుమాకలజోకనున్న యీాప్రమథులనుండిసాకువారెవ్వరు?

(భీకరారావంబులు సెలంగును.)

వీర.—ప్రమథగణంబులారా! వీనికిఁ గావలసిన ప్రాయశ్చిత్తమైనది లెండు. ఇంక మననివాసంబైన కైలాసంబున కేగి యాకాశకేశున కీవార్త వినిపింతము, రండు పోదము.

ప్రమ.—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు.)

---

క. పంకజముఖగిరితనయా
శంకరవై వాహికప్రశస్తకృతిని నై
దంకములం బ్రథమాంకము
వేంకటకోదండపాణి విరచిత మయ్యెన్.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః.

# శ్రీపార్వతీపరిణయము.

## ద్వితీయాంకము.

(మదనమిత్రచారుదేవుల ప్రవేశము.)

### విష్కంభము.

మద.—చారుదేవా! నిన్నటివార్త వింటివా?

చారు.—దక్షయజ్ఞవినాశన వార్తయేనా? అతని గర్వమునకుఁ దగిన ప్రాయశ్చిత్తమే జరిగినది. కాని యంత రభసముచేసిన యా వీరభద్రుఁడు మన సురలోకము నెంతగా బాధించునోయని భయమగుచున్నది. ఒక తారకాసురునితోనే పడలేకున్నాము కదా?

మద.—మిత్రమా! భద్రునివలని బాధ మన కేమియు లేదు. అతఁడీశ్వరుని కుమారుఁడు. ఈశ్వరుఁడు నియమించిన ప్రకారము యజ్ఞావసరంబున రౌద్రమును వహించెను. కాని యాశాంకరుఁడు సాత్త్వికస్వభావుఁడే; ప్రమథగణంబులతోఁగూడి కైలాసంబునఁ దపం బాచరించును. కాన నతనింగూర్చి మనము భయపడనవసరములేదు. కాని చారుదేవా! మన పూర్వజన్మదుష్కృతంబేమో యెప్పుడు నీ దుష్టదానవబాధలు పడలేక యున్నారముగదా?

చారు.—నిజమే! మన మమర్త్యుల మగుటగూడ నీ విపత్తున కొక నిమిత్తమే యైయున్నది. దీనిని జూచుకొని వారు పెట్టు నిక్కట్టులకు లోఁబడనలసినవార మైతిమి. ఎందఱు రాక్షసులనో చూచితిమి కాని యీ తారకుం బోలినవారి నెప్పుడుం గాంచమైతిమి.

మద.—చెలికాఁడా! అంతియెకాదు; వానిప్రతాపానలధూమంబు వలన [illegible] ల్లుచున్నది.

(ఆలోచించి) ఇంతవరకు వానిచేతులలోఁ బడినవారు నిర్బాధులు కాలేదుగదా? ఎన్నటికీ యంగదల కసంగత్వము సంభవించునో తెలియకున్నది.

చారు.—నేస్తకాఁడా! చూచితివా యీ ఘోరము? ఈ రక్కసి ముండకొడుకుల కెన్నిమారులు తాడనము గావించినను, వారి దుర్బుద్ధి వీడక యెట్లు సంచరించుచున్నారో? ఈ రిక్క రక్కసుండు (విచారము సూచించుచు)

సీ. కనుపడ్డ సురనర♦కామినీజనమును
గట్టిగాఁ బడఁదన్ని ♦ కట్టినాఁడు
కట్టి యెన్నాళ్లకుఁ ♦ గదలఁగానీయక
బిట్టుగా బాధలఁ ♦ బెట్టినాఁడు
క్రొత్తకోడండ్రను ♦ మొత్తంబుగాఁ దెచ్చి
పుంస్త్వధర్మముఁ దీర్పఁ♦బూనినాఁడు
గోకర్ష కాదులు ♦ గోలవెట్టుచునుండఁ
దడవుగా నేడ్పింపఁ♦దలఁచినాఁడు

ఆ. వె. ఇంత యనుకొనంగ♦నేల యాపౌలోమి
యేకతమున నుండి ♦ యెసఁగఁజూచి
మదనవిశిఖవిద్ధ♦మానుఁడై మఘవుచే
నింద నొందఁబడియె ♦ మందబుద్ధి.

మద.—ఔను ఇదియంతయు సత్యమే! ఇంక మన మీ యిడుమలఁ బడఁజాలము. ఎన్నినాళ్లు సహించియు, యుద్ధముఁ గావించియు నుంతేని నీవిపదబ్ధి నుత్తీర్ణులము గాలేకున్నాము. ఇంక వన ద్రిమ్మరి పిట్టలవలె వాపోవుచు వాసవుతో మొఱలు వెట్టుకొనకతప్పదు.

చారు.—చెలికాఁడా! ఆతండు నిన్నిదినంబులనుండి బాధ లనుభవించుచునే యున్నాఁడు. ఆతని కానక్షత్రరాక్షసుం డేమాత్రము వశుఁడు కాలేదు, కాన నతఁడు దేవతలవెంటఁగొని బ్రహ్మకడ కేగఁ దలంచియున్నాఁడు.

మద.—పోనిమ్ము, పితామహునిం జేరి తారకాసురవధోపాయం బెఱుఁగ వచ్చునుగాక. అదియు మంచిదే. భవితవ్య మెట్లున్నదో?

(నిష్క్రమింతురు.)

---

2 వ రంగము - పితామహసభ.

బ్రహ్మ.—(ప్రవేశించి యింద్రాదులు వచ్చుట చూచి) (తనలో) ఓహో! ఏదియో యుపద్రవము వచ్చినట్లున్నదే? లేనిచో నిబిడౌజుండగు బిడౌజుండు రానేల? (పరికించి) అష్టదిక్పాలకులుగూడ వచ్చుచున్నారే! ఎవ్వండో యొకానొక పూర్వదేవోత్తముండు తల్లోకంబునఁ బ్రవేశించినాఁడేమో? (ఇంద్రాదులు దగ్గరుదురు.) (ప్రకాశముగా) దిక్పాలకులారా! రండు రండు. ఈయాసనంబుల నుపవిష్టులుకండు. (వారు కూర్చుందురు.) అమరులారా! మీకంద ఱకు నేమంబ కదా! మిమ్ములం గాంచి,

క. ఎంతటికాలం బయ్యెను
వింతలు గలుగంగఁదోఁడఁగె ♦ వీక్షణములకుఁ
నుంతయిన బాధ లెఱుఁగక
యెంతయు సౌఖ్యంబు గలిగి ♦ యెసఁగుదురుగదా?

ఇంద్ర.—తాతా! మా నేమం బేమని చెప్పుదుము. చూడుము —

ఉ. ఎక్కడివాఁడొ దైత్యుఁ డొకఁ ♦ డేపునమాపునవచ్చి తాకఁగా
నక్కజమైనసైన్యముల ♦ నాతని నాజిని గెల్వఁబోవఁగా
నక్కట! నన్ను వీరలను ♦ నందఱఁ బారఁగఁదోలి యిప్పుడే
పిక్కటిలంగ దిక్కులను ♦ బ్రేలుచు వ్రీలుచుఁ జొచ్చెమత్పురిన్.

అంతట మే మందరముంగూడి మీతో విన్నవించుకొనుటకై యిటు వచ్చితిమి.

బ్రహ్మ.—వత్సలారా! ఇది యంతయు మీరువచ్చుచున్నట్లు తెలియఁగనే నిశ్చలధ్యాననిష్ఠాదృష్టిమెయి నెఱింగితి. అప్పటినుండియు నా తారకాసురమరణోపాయంబ విచారించుచుంటి,

ఇంద్రు.—పితామహా! మాకష్టంబు లన్నియు మీకు స్పష్టంబులైనను మామనోదుఃఖంబుల నాపుకొనలేకుండుటంజేసి చెప్పుకొనుచున్నారము వినుము. తాతా! నావృత్తాంత మేమన?

సీ. ఏకతంబున నుండు ♦ నిందాశ్రిణి నొకనాఁడు
గట్టిగా బాధలఁ ♦ బెట్టినాఁడు
రాజిల్లుచున్నట్టి ♦ వైజయంతముఁ గాంచి
పుడమి పైఁబడవేయఁ ♦ బూనినాఁడు
నందనవనమున ♦ సుందరపాదపో
త్పాటనంబుం జేయఁ♦దలఁచినాఁడు
ముద్దిచ్చిలి దైరావ♦తోచ్చైశ్శ్రవంబులఁ
గొట్టానఁ దనయింటఁ ♦ గట్టినాఁడు
తే. దైవకామినులను బలా♦త్కారముగను
బుంశ్చలీవర్తనకుఁ దీయఁ♦బోయినాఁడు
వింటివే పితామహా! తొలి♦వేల్పుతేని
దుండగంబులు సెప్పంగ ♦ మెండుగలవు.

మరియు—

ఉ. ఆసన మీయఁగాఁ గొనక ♦ యీరడివెట్టు; నివాసమీయఁగా
నాసను నంటఁ; డాతనికి ♦ హైమమయాంబరభూష లీయఁగా
వాసవ! నీవ నా కిడెడు♦వాడఁవు? మద్వశమైనసర్వముఁ
వీనముసైనముట్టకుము ♦ వెళ్లుము వేగ' మటంచు గెంటెడిన్.
ఇట్లే బహువిధంబుల నిందలు సేసె; నేమని చెప్పుకొందు,

(అని తల వంచుకొనును.)

అగ్ని.—కాంచనగర్భా! నామనవినిగూడ నాలకింపుము.

కం. వెలిఁగినను వెలుఁగకున్నను
నలుగును ననుఁగూర్చి తారకాసురుఁ డంతే;
నల యసురభీతి నింద్రా
దులకు హవిస్సు లిడఁజాలఁ ♦ దోయజజన్మా!

యము—దేవా! నేను సర్వజీవుల పుణ్యపాపంబుల విచారించి, తత్తత్ఫలంబుల వారిచే ననుభవింపంజేయుచు, సమవర్తి నని త్రివిష్టపంబులం గీర్తిమంతుండనై యుండ, నీ వసమవర్తివి. నీకీ యుద్యమాధికారంబు తగదని వెడలనడిపె.

మరియు—

ఉ. దండధరుండనంచు, సుకృతంబును జేసినవానినైన నా
దండను నుండువాని మన దాయ యటంచును గ్రూరదండన
ల్మెండుగఁ జేసినావు దయ లేక, నినుం గను మేను మత్తవే
దండము నెక్కి త్రొక్కెదను తాళుమటంచును నొక్కెనావెడన్.

దేవా! యిట్లు నేయువాఁడనే? నీవ యాలోచింపుము?

నిరృతి—కమలజన్మా! చిత్తగింపుము.

ఆ. తాను పొలసుదిండి నేను పొలసుదిండి
నైనఁ గొలమువాఁడ నంచునైన
తలపకుండ, నీవు దాయలఁ గూడితి
వంచు వాఁడు నన్ను నలయఁజేసె.

వరుణుఁడు—గంగాసహోదరా! కాంచనోదరా! ఇంక నాయపాంపతిత్వము పోయి విపదాంపతిత్వము నాకు సార్థకమైనది చూడుము.

చం. సతతము కామరూపమున సర్వసుపర్వతటాకనీరముం
గుతుకముతోడఁ ద్రావియును గోపపురూపున వచ్చి నీ వపాం
పతివిగదా! యికన్మరలఁ బావననీరములన్ సృజించి పూ
రితముగఁ జేయుమంచు బహురీతుల బాధలఁ బెట్టు నక్కటా!

వాయువు—విష్ణునందనా! నా మొఱాలకింపుము. మహితవహ్నుండు మత్ప్రియసఖుం డగుటంజేసి నాకుంగూడ నాతని యాపదలే సంభవించినవి. వినుము. నా సదాగతిత్వము సదా నిశాచరుండగు నీతారకాసురువలన ననర్థం బయ్యె.

మ. మెలమెల్లంగను వీచినం దనువునం బెన్స్వేదబిందువ్రజం
బులు నేన్ బోవనిఁ గోపగించు, నిఁకగాడ్పుల్ వీవఁ దత్పారకాం

తలమేనం బచరించు చందనపుఁబూ ♦ తల్ రేగునంచు న్ననుం
బలురీతుల్ కడగండ్లఁ బెట్టి తనువుం ♦ బాధించు లక్ష్మీసుతా!

అందువలన నెటు బోయినను గష్టంబులే ప్రాప్తించుచున్నవి. వీని నే నింక సహింపఁజాల.

కుబేరుఁడు.—పరమేష్ఠీ! నామాటలేమి వినియెదు? 'నిధినాయకుండను గదా? నీకిచ్చు వచ్చుదానిం గోరుము. లేక నవనిధులంగోరిన నిత్తు. ఇప్పత్తనంబు వీడి చను' మని యెన్ని విధంబులఁ బ్రార్థించినను, నాతఁడు నన్ను వీడఁ డయ్యె. అలకాపట్టణంబున నెచటఁ జూచినను దెగిన యులకలె యెక్కువాయె. ఏయెడఁ గాంచినఁ దారకాపవ్యం తం బెగురుచున్న తారకస్యందన కేతనంబులె! ఏచోటం దిలకించినను దత్సైన్యంబులే! ఇంక నే నెటు లోర్తు. సర్వపౌరజనంబులు గొల్లని గోలవెట్టినను లాభంబు లేదయ్యె. ఈయును రాతనికి గొట్టదాయేమి? మఱియు

శా. స్వైరారామమతల్లియై వెలయు నా ♦ సౌగంధికారామమే
సౌరుంబాసె ననంగఁ జెప్పవలెనే ♦ సర్వప్రచారస్థలుల్
మారుంబోలినవాని నాకొమరు సం♦బాధల్ కనన్ శక్యమే!
ఔరా! తారకుఁజంపగాఁగలమె శ్రీ♦పార్వత్యాత్మజా! చూడుమా.

ఈశా —వశిష్ఠజనకా! ఇంక దిక్పాలకకనిష్ఠుండనగు నాకష్ట నిష్ఠురంబుల నిష్టమనస్కుండవై యాకర్ణింపుము.

సీ. హోమకుండంబుల ♦ నొక్కని యుమియుచుఁ
జల్లార్చి వేడ్కతోఁ ♦ జనెడివాఁడు
ముసలంబు చేఁబూని ♦ మోదమనస్కుఁడై
మార్ఖుఁడై జటలపై ♦ మొత్తినాఁడు
దేహ మంతయు విభూ♦తిని బూసికొంటి నే
నంచని యెకసక్కె♦మాడినాడు
రుద్రాక్షమాలికా ♦ రూపంబు మాపి, క
మండలుదండముల్ ♦ చెండినాఁడు

ఆ ఇంత సెప్పనేల ♦ యెప్పుడు నాయెడ
నంతయైన గరుణ ♦ నూపఁ డెందు
నడరు గలుగఁజేయు ♦ నాపాపితల తెగి
కలికునేల నెపుడు దొరలఁ♦గనెదొ.

పితామహుఁడు—దిగీశులారా! ఇప్పటికి భవద్వ్యథ లన్నియు నాకుఁ గూడ మనోవ్యథలఁ గల్గించినవి. ఈ యును రాతనికిఁ గొట్టి గోడు గుడుపకుండునా? సత్పురుషచిత్తము త్తలపా టొందిన రిత్తవోవునా? ఖలుం డెప్పుడును భూమిపై మనండు. ధర్మమె జయ మందును. 'కష్టే ఫలీ' యన్నట్లు మీకు సుఖం బచిరకాలంబునఁ జేకురఁగలదు.

దేవేం.—పితామహా! భవదధీనులమై యున్న వారము. ఇఁక మమ్ముఁ బాల ముంచెదవో, నీళ్ళ ముంచెదవో? నీయదియే భారంబు.

పితామ.—ఇంద్రా! తారకుండు నాకు వశ్యుండు కాఁడు. వశ్యుండ మైనచో నిన్నినాళ్ళు గన్నులు దెరచుకొని మీవ్యథలను జూచుచు సహించి యూరకుందునె? అదియునుంగాక, యత్తొలి వేల్పుతుంటరి క్రొవ్వునం బలిసి దోర్బల మదాంధుండై యన్నమిన్న లనక మన్నుమెక్కు పసిపాప లనక సుర లనక, భూసురు లనక యాబాల గోపాలముఁ బీడించుచుఁ ద్రివిష్టపంబుల సంచరించుచున్నాఁడు గదా! మఱియు నా శ్రీవల్లభుండు సత్వగుణ ప్రిధానుం డౌటను వెండియుం గొండొక కారణంబున నద్దనుజుం బరిమార్పనశక్తుండు. తజ్జయము మాయిరువురకు నసాధ్యంబ.

దేవేం.—కొంప మునిగినదే. ఇంకెట్లు?

శా. తాతా! తారకు నీవ కూల్తు వనుచుర్వ ♦ద్వత్సన్నిధిం జేర నా
చేతంబుం బరితృప్తి సేయ కిటు నా♦చేఁ గా దటంచుం జగ
న్నేతర్ విష్ణునివేడ నిష్ఫలమె య♦న్నీవి ప్పు వాక్రువ్వ ని
ర్ధాతస్థేములమైతిమింక నతనిర్ ♦ద్రుంపగ మార్గమే లేదొకో.

పితా.—శచీప్రియా! నీవే యి ట్లుత్తలంపాటు సెందుటంజూడ నా చిత్తంబున కెంతయు వింత గొల్పుచున్నది. మనంబున శాంతి నెలకొల్పుము. భయంబు వీడుము.

దేవే.—శాంతింపక చేయఁగల దేమున్నది?

పితా.—(తనలో)ఇంతవర కనంత సంతాపసంతప్తస్వాంతుం డగుట మిగులఁ బొగులుచున్నాఁడు. త్వరలోఁ దద్దానవ వధోపాయంబు సెప్పి ధైర్యంబు గూర్తుఁగాక. (ప్రకాశముగా) సురేంద్రా!

దేవేం.—ఇంకను సురేంద్రనామంబున నాహ్వానించెద రేల? సురేంద్రత్వ మెన్నఁడో పోయినది.

పితా.—"ఓడలు బండ్లు బండ్లోడలు" నగును. దాని కేమిగాని, నీవొక్క గొప్పకర్జంబు గావింపవలసి యున్నది. అది యేదనినఁ బ్రమథగణార్చితుండు, భక్తజనహృదయావాసుండు నగు పరమశివుండు బ్రహ్మచర్య మూని, దక్షిణామూర్తియై హిమాలయవనంబునఁ, దపంబు గావింపుచున్నవాఁడు. ఆ మహాదేవునివలనఁ గాక యి క్కార్యంబు వేర నెరవేర్పఁబడదు. నాతం డొక్కఁడ యిక్కర్జంబు సాధింప దక్షుండు.

దేవేం.—ఎట్టి దుర్ఘట కార్యంబు సంభవించె! మహాదేవునికిం గూడ నశక్యంబకదా? ఇంక నెట్లు? (ప్రకాశముగా) చెప్పుఁడు, చెప్పుఁడు. ఇం కెట్లు నిర్వర్తిల్లు?

పితా.—పాకశాసనా! ఎఱుంగుదువుగదా! సంతతనిష్యంది శీతల జలబిందుసందోహసమన్వితుండును, నాశ్రితజనకల్పభూరుహంబును, సర్వసర్వంసహాధరశ్రేష్ఠుండును నగు హిమవంతునకుఁ జిరకాలంబునకు దేవియనుగ్రహంబునఁ, బూర్వజన్మంబున దాక్షాయణిపేరం బరగిన శివప్రియ పునర్జన్మంబునఁ బార్వతి యను నామంబున నుదయించినవార్త.

దేవేం.—చిత్తము.

పితా.—ఆమె ద్వాదశవర్షప్రాయయై యున్నది. ఆమె దేవ్యంశసంభూతురాలగుటచే దండ్రి కొన్నియో ధర్మంబులు సెప్పి నారదాదులయాజ్ఞం గైకొని, వనంబున కేగనున్నది.

దేవేం.—ఏమీ? వనంబునకా? తపంబునకే కాఁబోలు?

పితా.—అగును.

దేవేం.—కారణ మేమై యుండును?

పితా.—ఇంద్రా! వినుము. తొలిపుట్టువునఁ దన నాథుని యాజ్ఞ నుల్లంఘించినందులకుఁ బశ్చాత్తాపత ప్తయై మృతి నొంది తిరిగి రెండవజనిం గూడ నాతనిన చేపట్టఁ బ్రతిన వట్టినది. ఇప్పుడు తద నుగ్రహసంపాదనార్థమయి యే మహారణ్యంబున కరిగి మహాతపంబు గావింపనున్నది.

దేవేం.—తాతా! నిజముగాఁ గాంతలే ప్రతిజ్ఞాపాలికలు కదా?

పితా.—అగును. మఱియు నీఘోరవిపచ్ఛాంతికై యాతాపసతప స్వినుల నొక్కచో సంఘటింపఁజేయవలయు. అనఁగా శివశక్తి లేకము కావలయు. అట్లు వారిని గూర్పఁగలిగితి మేని,

చ. విమలయశోవిశాలుఁడు వివేకసమగ్రుఁడు శౌర్యధుర్యుఁ డ
య్యమరగణాధిసేవ్యుఁడును నంబుజమిత్రపవిత్రగాత్రతే
జముగలవాఁడునై కుధరజాతకు నంతకశత్రు కర్మిలిం
గొమరుఁడు గల్గును మ్మతఁ డకుంఠితవీర్యముతోడఁ దారకుఁ
యమసదనార్థిఁ జేయు నహహా యని మీరలు సంతసింపఁగ౯.

దేవేం.—(జనాంతికముగా) ఏమి? వారికూటమియా? ఎంత కష్టమెంత కష్టము! తమోగుణప్రధానుండు, ఫాలాక్షుండు, సహస్రసూర్య తేజోదుర్నిరీక్షుండు నగు నమ్మహేశ్వరు తపోవిఘ్నంబుఁ గావించు టెట్లు? ఎటువంటి కామసంచారులైనను దత్పరిజన ప్రమథగణం బులకే లొంగవలయుం గదా? ఇంక వారిని దప్పించుకొని యాప్పుర వైరిని డగ్గరు టెట్లు? మనలో నంతటి కార్యనిర్వాహకుం డేఁడీ! ఎవ్వండును లేఁడు. ఇంక, రంభాదిత్రిదశకాంతలం బంపుద మన్న వారి విభ్రమంబుల కాతండు లొంగఁడుగదా? ఒకవేళఁ లోఁబడునే యనుకొందము. తజ్జనిత రోషానలజ్వాలలకు వెంటనే వారల నర్పింపకుండునా? అప్పుడు చేతులార స్త్రీవధంబు గావిం చినవాఁడ నగుదు. ఇఁక నమ్మహాదేవుని మనంబు పార్వతిపై

మరలించుట యెట్లు? ఇదంతయు నసాధ్యం బనియే కన్పట్టెడు. ఏమి సేతు? (ప్రకాశముగా) కాంచనకమలావాసా! ఎంత దుష్కర కర్మంబు కర్తవ్యంబైనది?

ఉ. ఎట్టులు నిట్టి కార్యభర • మేమిట మోయఁగలార మిస్సిరో!
కట్ట! తిలోత్తమాదులకు • గాని మదీయులకైనగాని యి
ప్పట్టున సాధ్యమే యతని • పజ్జకుఁబోవఁగనైన? నక్కటా!
వట్టివియాసలింక శల • భంబులు నగ్నిని వ్రాలుటే సుమీ?

పితా.—సురేంద్రా! ఊరక భయపడెద వేల? అందులకుం దగిన వ్యక్తిని నేన వక్కాణించెద. వినుము.

చ. ననవిలుకాఁడు దంపతుల • నర్మిలిఁ గూర్పఁగ నేర్పుగల్గువాఁ
డనిలవసంతమిత్రుఁడును న • బ్ధిసుతాప్రియపుత్రకుండునౌ మన
మదనుండె యిప్పని గ్ర • మంబుగఁ దీర్పఁగఁ జాలువాఁడు, నే
ర్పున మన మాతఁ డీపనికిఁ • బూనునటుల్ పురికొల్పఁగావలెఁ.

దేవేం.—పితామహా! భవదనుగ్రహంబున నిక్కట్టు లన్నియు దాటినట్లే. వారి కనురాగంబు గల్గింప నాతండ సమర్థుండు. ఇంత మాత్ర మాలోచింపలేకపోయితినే? (అని సిగ్గుపడును.)

పితా.—బిడౌజా! లజ్జాపరవశుండ వయ్యెదేల? చింతావశంబున స్వాంతంబునకుఁ దోఁచకపోయినఁ బోవచ్చు. దానికేమి? ఇఁక మీరందఱు మీ నివాసంబుల కరిగి సుఖంబునకై వేచియుండుఁడు. అచిరకాలంబున నాపదలు తొలంగఁగలవు.

దిక్పా.— జయము! జయము!

పితా.—ఇంద్రా! (ఆకాశమువైపు చూపించి)

తే. వైరిభూపతుల నడంప • వచ్చుచున్న
రాజసింహునిఁబోలె నా • రాజమిత్రుఁ
డొప్పె నడిమింట రతనాల • కుప్పవోలెఁ
జూడఁ జూడ్కులకెంతయు • సొంపుమీఱ.

దేవేం.—వచ్చినందులకుఁ గర్తవ్యాంశము తేటతెల్లమైనది. ఇంకం బోయివత్తు. ఇందులకుఁ బ్రత్యుపకారంబు నే నేమి నేయంగలాఁడ? ఇవిగో! నా నమస్కారశతంబులు.

పితా.—(నవ్వుచు) అట్లెన్నఁడుఁ దలంపవలవదు. ఎవ్విధంబుననేని నితరులమనంబునకు స్వాస్థ్యంబు గూర్చువాని మనుగడయే మనుగడ. ఇందు నాకుఁ గష్టంబు లేదు. నీ వినయౌదార్యంబులకు సంతసించితి.

దేవేం.—సజ్జనులలక్షణంబు లవియేకదా?

పితా.—పోయివత్తువా?

దేవేం.—చిత్తము. (అని) దిక్పాలకులారా! బయలుదేరుఁడు. తాతా! పోయివచ్చెదము.

పితా.—కార్యసిద్ధి రస్తు.

(నేపథ్యమున) తథాస్తు; తథాస్తు.

పితా.—అదిగో! ఆకాశవాణిగూడఁ బల్కుచున్నది. శుభం బగుంగాత! పోయిరండు.

దేవేం.—చిత్తము. (దిక్పాలకులతో నిష్క్రమించును.)

పితా.—ఇంకఁ గాలోచితకార్యంబుల నిర్వర్తింతము. రండు. (అని వెళ్లును.)

---

3 వ రంగము - ప్రవేశము : మేనకాహిమవంతులు.

హిమ.—వనితామణీ! ఇప్పటికి మనము సంతానము లేదనెడు చింత మాని, నవలావణ్యవతియగు పార్వతి నెల్లప్పుడుఁ గాంచుచు నానందము నందుచుంటిమిగదా? మఱియు.

ఉ. పుత్రులఁగాంచు కోర్కెమెయిఁ ♦ బుట్టల గుట్టలఁ జెట్లఁజుట్టుచుఁ
వృత్రహరానుజుం గొల్చి ♦ యిందిరయందము చందమంది క్రాల్

పుత్త్రికఁ గంటి మిప్పటికిఁ ♦ బొందియు ద్వాదశవత్సరంబులై
పుత్త్రులకంటె నెక్కుడుగ మోదముఁ ♦ గూర్చెఁగదా తలోదరీ!

మేన.—నాథా! ఔనుగాని, పార్వతికిఁ బెండ్లియీడు వచ్చినదిగదా! అందుల కింక, వేగముగా, వివాహమహోత్సవము గావించుట యుచితంబని తోచుచున్నది.

హిమ.—ఔను. నిజమే. ఎప్పుడైన నామెతో నీవిషయమై హెచ్చరించి చూచితివా?

మేన.—ఎన్నిసారులో యీ విషయమై పలుకరించితిని. కాని, యేమియుం బలుకక కొన్నిమారులు, నా కిచ్చవచ్చినప్పుడు చేసికొనియెద నని కొన్నిమారులు, నుత్తర మిచ్చెడిది.

హిమ.—ప్రేయసీ! లజ్జావనతయై యట్లు సెప్పెనేమోకాని, మనము కూడ నూరుకొనవచ్చునా? చూడుము.

ఉ. ప్రాయము వచ్చినంత మన ♦ బాలకు రాజకుమారు నొక్కనిం
బ్రాయమువాని సంపదల ♦ వర్ధిలువానినిఁ గూర్చి పెండిలిం
జేయక పోయిన న్మనల ♦ ఛీ! యనుచుం నిరతంబు నీత్యుపా
ధ్యాయులు నిందసేతురు గదా? తలపోయ నరాళకుంతలా!

మేన.—ఇది యంతయు సత్యమే.

హిమ.—సతీ! నీ వెన్నిమారులు సెప్పినను నిష్ప్రయోజనం బయ్యెగదా? ఆమెసఖులచేతనైన నడిగింపక పోయితివా? వారితో నేమేని తనమనోభావం బెఱింగించునేమో?

మేన.—నాథా! ఆ ప్రయత్నముగూడ జరిగినది. ఏమిలాభము?

హిమ.—అందువలనఁగూడ ప్రయోజనము కలుగదయ్యెనా?

మేన.—లేదు.

హిమ.—సరే! కానిమ్ము. ఏది యెట్లు కానున్నదో ఎవ్వర మెఱుంగముకదా? నేనుగూడ నొక్కసారి చెప్పి చూచెదను. జనకుఁడనని నా మాటనైన పాటించునేమో?

(అని) ఎవరురా! అక్కడ?

ప్రతీహారి—(ప్రవేశించి) దేవా! ఏమి సెలవు?

హిమ.—పార్వతి నొకమా రిటు పిలువుము.

(ప్రతీహారి వెళ్ళి పార్వతితోఁ బ్రవేశించి)

ప్రతీ.—దేవా! ఇదిగో! అమ్మాయిగారు విచ్చేసియున్నారు.

హిమ.—మంచిది. నీవు పొమ్ము. (ప్రతీహారి నిష్క్రమించును.) (పార్వతిని దగ్గరకుఁ దీసికొని) బిడ్డా! నే నొక్క యాజ్ఞారత్నం బిచ్చెద. ఏమి సేతువు?

పార్వతి.—తండ్రీ! తప్పక శిరసా వహించెద.

హిమ.—వహింతువా? ఐన వినుము. నీ కిప్పుడు ద్వాదశవర్షంబులు నిండినవి. ఇదియ వైవాహికసమయము. కాన నెవ్వని నేని నొక్క రాకొమరుని వరించి పెండిలియాడి సుఖంబుండి మాకు నిండిన యానందంబుం గూర్పుము.

పార్వ.—(తల వంచుకొనును.)

హిమ.—అమ్మా! ఏల లజ్జాపరవశ వయ్యెదవు? నీ చెలికత్తెలలో నొక్కర్తుకకైన నీమనోభీష్టం బెఱింగింపలేకపోయితివా?

పార్వ.—జనకా! చెలుల కేల? నీవు నన్నింతగా నడుగుచున్నందున చెప్పుచున్నాను. వినుము. దాపఱిక మేల? ఇదే నావాంఛ.

తే. ఇంతవరకును నొక్కని, యెడలనైనఁ
బ్రేమరసబిందు వొగిఁ జింది ♦ వెడలలేదు
కాని పరశివునందు నా ♦ మానసంబు
దవిలియున్నది తీర్పు మా♦దారిఁ దెలిసి.

హిమ.—ఆహాహా! ఎంతకోర్కి కోరితివి? ఈ మాట వినినంతనే మన్మనంబున దుఃఖాశ్చర్యంబులు పెనఁగొనుచున్నవి. (మేనక వైపునకుఁ దిరిగి) రమణీమణీ! చూచితివే? బాలయయ్యుఁ దనకుం గల బుద్ధిబలంబున నాలోచించి వైరాగ్యంబుఁ బూని యిట్టి

వాంఛం దీర్పుమని వేడుకొనెఁగదా? ఎట్లు దీనిం దీర్తు? (పార్వతిం జూచి) కన్యకారత్నమా! వినుము.

ఉ. ఎందఱొ దేవరాజసుతు ♦ లిందును నందు గుణాభిరాములై
యిందునిభాస్య! యుండి రిఁక ♦ నీయెడ వారల నిచ్చవచ్చువా
నిం దగఁ బెండ్లియై ప్రమద♦నీరధి మమ్ములఁ దేల్చియుండ కా
చందురుదాల్పుఁ గోరితి, పిశాచనిశాచరనాథు నక్కటా!

(ఆలోచన నభినయించి) ఆతని కేమి? సర్వలోకైకనాయకుం డుగదా? అప్పురుషోత్తముఁడు రాజశేఖరుఁడు నైన శంకరున కే యిచ్చి పాణిగ్రహణంబు గావింపుదమన్న నద్దియు మన కసాధ్యమే.

ఆ. బ్రహ్మవిష్ణుపాక ♦ వైర్యంశసంయుతుఁ
డైననేమొకాని, ♦ యభవుఁ డేడ?
పర్వతాత్మజవగు ♦ బాలికా! నీ వేడ?
కోర్కు లిట్టివి సమ ♦ కూడునెట్లు?

పార్వ.—తండ్రీ! పోనిండుం అతండు నా కిప్పు డప్రాప్తుం డనికదా మీరు భయంపడుట? అట్లే కానిండు. ఆతని వశ్యునిగాఁ జేసికొన నింక నేమియు నుపాయాంతరంబు లేదా? ఇదిగో చూడుఁడు.

తే. నా మనోభీష్ట మెనఁగునం♦దాక సన్న్య
సించి రుద్రాక్షమాలిక ♦ చేతఁ బూని
తపము సేతును వనమున ♦ దనుజహారుని
గృత్తివాసుని దలఁచుచు ♦ బత్తిమీఱ.

హిమ.—(చెవులు మూసికొనుచు) హరహరా! ఎంతమాటపల్కితివి! నీ సాహసకృత్య మిప్పటికిఁ దెలిసికొంటిని. ఏదియో యొక యలభ్యంబైన కోరికంగోరి దానిం దీర్పకయున్నఁ దపంబు గావించెద నని ప్రతినఁ బట్టుదువే? తపంబు గావించుట సామాన్యమే? బాల్యంబున నుండుటంజేసియు, దానియందలి కష్టసుఖంబు లెఱుంగనిదాన వగుటంజేసియు, నట్లు పల్కితివి. కాని సంసారవిరక్తులై యరిషడ్వర్గంబు జయించి సర్వైహికవాంఛల నీడి, యేచింతయు లేనివారైనవృద్ధులు సేయఁదగిన తపఃకార్యంబు నిర్వహించుటకు

సాధ్యంబే ? కావున నిట్టి గొంతెమ్మకోరికలం గోరక యొక్క భూభృత్కుమారు, నవమన్మథాకారుఁ బెండ్లియాడి సుఖంపుము. మఱియు నిందుఁ బిత్రాజ్ఞం బరిపాలించినదాన వయ్యెదు. ఇంతవర కెందఱిచరిత్రిలనో వినియుంటిమికదా ? ఎక్కడనైనఁ గాంతలు సుంతయేని జనకాజ్ఞాపరిపాలక లని వినియుంటిమే ? లేదు. ఇప్పు డీవు నా మాటలం బాటించిన సాటిలేని యశంబును గాంచఁగలవు. చూడుము.

సీ. తల్లికోరికఁ దీర్పఁ • దనతండ్రియానతి
రాముండువోయె నరణ్యమునకుఁ
దండ్రియాజ్ఞను దీర్ప • ధర్మంబుఁ దొలఁగియు
పరశురాముఁడు తల్లిశిరము నఱికెఁ
దండ్రి పల్కినమాటఁ • దలఁదాల్చియేకదా
వీరభద్రుఁడు సంపె • విప్రసమితి
జనకవాక్యమ్ముఁ బాలనసేయనేకదా
మున్ను సుధన్వుండు • మునిఁగె నూనెఁ
గానఁ దొల్లి యొక్క • రైన మీరినవారె
తనను గన్నతండ్రి • యనిన మాట
దాన నీవు తలఁచ • దాలిచి నాపల్కు
యశము గాంచుమమ్మ ! • యబ్జవదన !

మేన.—అమ్మా ! నీతండ్రి యాజ్ఞారత్నంబు నౌదలం దాల్తునని నుడి వితివిగదా ఎందుల కిట్లు మూర్ఖ వయ్యెదవు ?

పార్వ.—అమ్మా ! నిజమే ! అట్లే పల్కియుంటిని. తండ్రియాజ్ఞ యేమన - నే నెవ్వరినో యొక్కరిని బెండ్లియాడవలయుననియే కదా?

మేన.—ఔను. అదియే.

పార్వ.—ఇంక నేమి ? నే నాపినాకికర గ్రహణంబుచేసెద నని ప్రీడ యిసుమంతయైనను లేక మీకుఁ జెప్పితినిగదా ? ఇఁక దానికి ప్రాతి కూల్య మేమున్నది ?

మేన.—నిజమే! కోరుకొంటివి. కాని యతండు మనవంటివారల కలభ్యుండుగదా? ఈవిషయంబుగూర్చియేకదా సప్రామాణ్యంబుగ వక్కాణించినది?

పార్వ.—తల్లీ! అందులకు సమాధానం బిచ్చితింగదా? తపోబలంబున నే నాతని వశ్యుంగాఁ జేసికొనెద నని.

మేన.—నీ విట్లు పల్కుచుండ నే నేమనుదాన.

పార్వ.—జననీజనకులారా! మీమాటల నతిక్రమించితి నని నాపైఁ గినియఁపలవదు. నా మనవి యొక్కటి యాలకించుఁడు. భవద్వచనంబులు విశ్వాసార్హంబులు గీర్తిమంతంబులునై యున్నవి. కాని నాపూర్వజన్మ సుకృతంబుననో, పెద్దల యనుగ్రహంబుననో, లేక యాసర్వమయుండు సర్వభక్తజనమానససరసీరుహమత్తభృంగాయమాణుండు నగు పరమేశ్వర నిర్హేతుక కరుణాకటాక్షవీక్షణంబుననో నామనం బాతనియందు లోహ మయస్కాంతంబునందుం బోలె లగ్నంబై యున్నయది. మఱియు.

చం. త్రికరణ శుద్ధిగా నెదన ♦ రించితి శంకరు నింక జంకఱ
నుకమును గాంచనిమ్ము పలు♦చొప్పులఁ గష్టము లందనిమ్ము త్ర్యం
బకు నె వివాహమాడుదును ♦ మానస మొక్కెడ లీనమౌచు వే
రొకయెడ కేగునే సతత ♦ ముండదె మానసమందు నంచయున్.

అదియునుంగాక యింక నాశశాంకాంకునుండి నాచేతం బీతలంబడదు వెండియు నిమ్మహాకార్యంబున మన వంశజాత లందఱకు నకలంకంబగు యశోమల్లికాపటంబుఁ గప్పినదాన నగుదుంగదా? కాన సాదరంబున నీ మాయనుంగుఁగూతు నీయుద్యమంబునుండి వీడుటకు నిర్బంధింపకుండెదరు గాకయని మిమ్ములను నాగంగాధరు నెన్నివిధంబులనో వేడుచున్నదాన.

హిమ.—(తనలో) కటకటా! ఎట్టియవస్థ సంభవించినది! ముందుఁ జూచిన గోయి, వెనుకఁజూచిన నూయివలె నాయెనే. తపఃప్రయత్నంబు మానుమని యాజ్ఞాపింతమా? ఆబిత్తరిచిత్తంబునం దున్న

కోరికరి త్రయగు. మఱియు నయ్యది నాకునుం గలుషావహాంబ. ఈమె సెప్పువాక్కు లన్నియు నర్థవంతంబులు నకారణంబులు నైయున్నవి. తపంబున కంగీకరింతమా? ఈమె బాల. సర్వకూరసత్త్వసంతాన సంకులంబగు నరణ్యంబున విడచి నే నెట్లుందు? ఇంకం దెరు వెయ్యది? హా! పరమేశ్వరా! నీవే దిక్కు. (ఆలోచన నభినయించి) వేరొకమా ర్లిట్లు మందలించి చూచెద. (ప్రకాశముగా) బాలా మణీ! నే నెన్నివిధంబుల నొక్కివక్కాణించినను నాఁడు పట్టిన కుందేటికి మూఁడే కాళ్లనుచున్నావుగదా! ఏమి సేయుదును? ఈయొక్కమాటను సావధానవై వినుము.

పార్వ.—తండ్రీ! నేను నిత్యసావధాననై యున్నదాన; సెల విమ్ము.

హిమ.— తే. ఎంతకాలంబొ యీశ్వరి • నుంతమైన
స్వాంతమందున విడక య•ర్చనల సలిపి
నిన్నుఁ బడసితి మిప్పు డో•యన్నుమిన్న!
కాన సన్న్యసించియుఁ బోవఁ•గాను వలదు
నేను మీయమ్మ దుఃఖాబ్ధి • నిల్చి పొగుల.

మేన.—పుత్రీ! ఇదిగో నాయీమాటల వినుము. నే నెన్నిమారులో నీవివాహవిషయమై నీతో సంభాషించితి. మఱియు నీతండ్రి గారుగూడ నెన్నివిధంబులనో బోధించియున్నారు. కాని నీ వెద్దియో దుర్లభం బైన వస్తువుం గోరితివి. అందువలన లాభం బేమి? నీవు తపంబు మొదలిడెద వనుకొనుము. దాన నాతనికి మెప్పు గల్గునో లేదో?

పార్వ.—భక్తులయెడ నాతండు దయాంతఃకరణుండుగదా? పోనిమ్ము. అట్లు గాకపోయిన నాతనికి మెప్పువచ్చునందాక నాచరించెదఁ గాక, అంతటిభాగ్యమే కలుగవలయును.

మేన.— ఎంతకు సాహసించితివే! ఇంక నేను మాట్లాడను. నీజనకు నను మతంబున నీయిష్టముం దీర్చుకొనుము.

పార్వ.—ఓమాతాపితలారా! ఇదియే నాప్రతిజ్ఞ, నావాంఛ. నేను మనోవాక్కులచేఁ బినాకీని బొందితి. ఇంకఁ గాయకర్మంబులఁ జెందఁగవలె. ఇందులకుఁ దపస్సాధనమే యుచితం బని మీర లెఱింగినదేకదా? అందుల కింతవరకు నేను గావించినవాదంబునకుఁ గోపం బూనక సదయులై దీని కనుమతింప వేడుచున్నదాన. (అని నమస్కరించును.)

(తెరలో) తథాస్తు, తథాస్తు.

మెన.—హి.—(లేవదీయుదురు).

హిమ.—అమ్మా! ఇందుఁ గ్రోధజనకంబులగు భాషణంబు లేమి కలవు? నీవు చెప్పిన దంతయు సత్యమే? నీవు బాలికవు, వివాహసమయువు నగుదు, నీ వద్దాని నాచరించుట దుష్కరం బంటిమి. కాని వేరు కాదు. ఇందులకు మనంబునఁ జింతిలవలదు. మఱియు నాకాశవాణియు "తథాస్తు" అని దీవించినది కదా! (శ్రుతి నభినయించి) తంత్రీనినాదాకర్షిత సర్వజన సమూహుం డగు నారదుండు వచ్చుచున్నట్లున్నాఁడు. అమ్మహర్షిని నీవిషయమై యడిగి తెలిసికొందునుగాక!

[ప్రవేశము: మహతీసహితుండగు నారదుఁడు.]

పా-మే-<br>హి.— } (నమస్కరింతురు).

హిమ.—దేవా! ఈగద్దియ నలంకరింపుఁడు. (అని పీఠము నిచ్చి విచారముతో నిలుచును)

నార.—(కూర్చుండి) హిమవంతా! తెలిసినదిలెమ్ము నీమనోగత వికారము.

హిమ.—బ్రహ్మమానసపుత్రులగు తమకు వ్యక్తంబులు కాని విషయంబులు గలవా?

నార.—గోత్రతిలకా! నీకూతు విషయమై యాలోచించుచుంటివా? వినుము.

హిమ.—చిత్తము.

నార.—ఓయీ! నీ కింతవిచారమేల? పార్వతి, దేవ్యంశసంభూత సుమీ! ఇఁకనామె యాపరమేశ్వరునిం దక్క నన్యుని వివాహంబగు టెన్నటికేని సమకూడునే? ఆమెను తపంబునకుఁ బోనిండు. అచిర కాలంబుననే పరమేశ్వరుం బ్రత్యక్షంబు గావించుకొని, యాతని మెప్పువడసి యానీలకంఠు కేలు పట్టఁగలదు. ఏమియు భయంబు లేదు. పార్వతీ! యిటురా! (అని పంచాక్షరి నుపదేశించును.)

పార్వ.—సంతోషము! సంతోషము.

హిమ.—హర్షీ! జనానందకారులగువారిలో భవాదృశులగు వారిని వేరొకరిని గాంచలేదు. ఆహా! తమవలన నిప్పటికి నామనంబు కుదుటఁబడినది.

మఱియు,

ఆ. మున్ను పుత్రిజన్మ ◆ మును గూర్చి పల్కితి
మరల నిప్పు డిట్లు ◆ మాటలాడి
నాదు వంతయంత ◆ పోఁదోలి తింక నే
నెట్లు దీర్తు నీదు ◆ ఋణము? దేవ!

నార.—హిమవంతా! ఇంక నే నరిగెద. సుఖం బుండుఁడు.

(అని నిష్క్రమించును.)

హిమ.—బాలికామతల్లికా! నారదమునీంద్రునివలన నీపావనో దంతంబంతయు నెఱింగితిమి. నీజన్మంబున మాగోత్రంబు పవిత్రం బైనది. ఇంకఁ దపోబలంబున నీశుం బొందుము.

పార్వ.—జనకా! ఇంకఁ బోయివత్తు.

హిమ.—అచిరకాలే శివసాక్షాత్కారసిద్ధి రస్తు.

పార్వ.—జననీ! తపంబునకుం బోవుటకు సెలవిమ్మా.

మేన.—అమ్మా! పోయిరమ్మా. కార్యసిద్ధి యగుంగాక.

హిమ.—పుత్రీ! నీవు నల్పు శివపూజార్థంబు ఫలపుష్పపత్రిజలాదులం దెచ్చుటకై నీయనుంగుఁజెలు లగు చంద్రముఖీ పద్మనేత్రిల వెంటఁగొనిపొమ్ము. వారలవలన నీవార్త మాకప్పుడప్పుడు తెలిసికొనవీలగును.

పార్వ.—అట్లే చేయుదును.

హిమ.—ఐన మన యింటఁ బోవుదము పద.

(అందఱు నిష్క్రమింతురు)

---

క. పంకజముఖ గిరితనయా
శంకరవై వాహిక ప్రశస్తకృతినిఁ నై
దంకముల ద్వితీయాంకము
వేంకట కోదండపాణి విరచిత మయ్యెన్.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః.

# శ్రీపార్వతీపరిణయము.

## తృతీయాంకము.

### 1 వ రంగము.

రతీమన్మథవిహార-వనప్రదేశము.

[రతీ మన్మథుల ప్రవేశము.]

మన్మ.—ప్రియసఖీ! నేఁ డెంత యానందకరముగా నున్నది! ప్రియమిత్రుండగు వసంత మాధవుండు వనలక్ష్మీకర గ్రహణమునఁ జెలంగియుండ నీశుకపికాది ద్విజగణంబు లెట్లు మంగళాగమ మంత్రాలాపములమిషంబునఁ బాడుచుఁ గౌతుకంబున నున్నవో చూడు!

సీ. చిగురుటాకులఁ దెచ్చి • చెలులకు నందిచ్చి
మెక్కించు చిలుకల • మెలవుఁ జూడు
మకరందమును ద్రావి • మత్తిల్లి పాడెడి
యళులగీతంబును • గలయవినుము,
చక్రవాకాంగనా • సంగతి సంతోష
మును గాంచుజక్కవ•పోతుఁ గనుము
విరహులపాలిటి • యురులఁబోలిన లతా
మందిరంబుల సతీ • మణులఁ జూడు,

తే. గీ. చూడఁజూడంగఁ జూడ్కుల • సొంపు మిగుల
నీవనంబున కిప్పటి • కీ వసంతుఁ
డఱుఁగు దెంచియ యుండుఁబో • యట్లుకాని
మొదల నెట్టులు గల్గుఁబో • యిట్టి శోభ?

రతి.—అదియంతయు నిజమే; కాని యిటు చూడుము.

తే. గీ. బండిగురివెంద పూఁబోంట్లఁ ♦ బల్లవాళి
వాఁలుటలు, కాన సిరిమోవి ♦ పానకంబుఁ
దాఁవుచున్నట్టి చెలువుఁడౌ ♦ నావసంతు
వదనకాంతులవలె మావి ♦ పైఁ దలిర్చె.

మఱియు నీవనలక్ష్మీశోభ చూడఁజూడ నతివర్ణనీయంబుగా నున్నది.

తే. గీ. సాంధ్యరాగంబు నాల్గుదిశలను బర్వఁ
గమలమిత్రాంశువులు దోచెఁ ♦ గాఁలు రాత్రి
పతినిఁ బిల్వఁగఁ జను చెలుల్ ♦ పట్టు దీవ
నప్యకాంతులోకో యన ♦ నాథ! చూడు.

మన్మ.—అవును. బాగుగా వర్ణించితివి. (అని వెనుకతిరిగి చూచి) అదిగో! యెవ్వరో వచ్చుచున్నట్లున్నది. నే నాతనియాగమన కారణం బరసివత్తు. నీ వింతలో నంతిపురంబున కరుగుము.

రతి.—సరే! అట్టులనే కానిండు, వెళ్లుచున్నదాన.

(అని నిష్క్రమించును.)

ప్రతీహారి.—(ప్రవేశించి) దేవా! దేవరవారిదర్శనంబునకయి వచ్చితి.

మన్మ.—ఓయీ! నీ వెవ్వరు? నీవచ్చినపని యేమి?

ప్రతీ.—నేను మహేంద్రుని యాస్థానంబున నుండువాఁడ. నన్ను నీకడ కొండొక యుత్కృష్టకార్యార్థంబు పుత్తెరఁ బని బూని వచ్చితి. ఆకృత్య మీలేఖవలనఁ దెల్లంబగును. (అని లేఖ చేతి కందిచ్చును.)

మన్మ.—(సస్మితముగా లేఖ చదువుకొని) (తనలో) ఆహాహా! యెంతచిత్రము! సకలామరపూజితుండగు నామహేంద్రునకే నాసాహాయ్యయంబు కావలసివచ్చెగా? ఏదో యొక మహాకార్యంబని లిఖించెనే గాని కృత్యం బెద్దియో తెలుపఁడయ్యె. ఏమైనఁ

గానిమ్ము. శచీజాని న న్నిట్లు గౌరవపూర్వకంబుగా నాహ్వానించినపు డాతనియాన త్రోసిపుచ్చుట తగదుగదా? అందువలన నొకమా రిదియంతయు నాప్రాణప్రియకుఁ దెలియపఱచి వెళ్లివచ్చెద. (ప్రకాశముగ) ప్రతీహారీ! సకలవిషయంబులు దెలియ వచ్చినవి. ఇప్పుడే ప్రయాణము గావింతము. వచ్చెద నుండుము. (అని నిష్క్రమించి తిరిగివచ్చి) ప్రతీహారీ! బయలుదేరుదమా!

ప్రతీ.—చిత్తము.

మన్మ.—ముందు నడువుము.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

---

[2 వ రంగము—ఇంద్రసభాభవనము.]

ఇంద్రుఁడు—(ప్రవేశించి తనలో) నేఁటి యుదయమునఁ బ్రతీహారింబంపియుంటిఁగదా? ఇంతవరకును రాఁడయ్యె. ఇంతకును నా ప్రార్థన మంగీకరించెనో లేదో? ఏమియుఁ దోచకున్న దే? అతఁడీపని కొప్పుకొనకపోయిన నింక నెద్ది తెరవు? దైవమా! నీదాసుల మగు మమ్ము నాపదలపాలుచేయుట పాడియే? మఱియు నయ్యుగ్రతపోమహిముని విహూపాక్షుని తపోభంగము చేయవలయునని పలుకఁగనే యాతండుకూడఁ జంకెనేమో? ఇంకఁ గర్తవ్యమేమి? ఆ ప్రయత్నమన్న చేయుదమనుకొన్న, నాతఁడుగాని యాతని చెంతనుండి యేమైన వార్తగాని రాదయ్యె! ఆహా! దైవసంఘటన!

సేవకుఁడు.—(ప్రవేశించి) దేవా! ప్రతీహారి యొక మోహనాకారునితో ద్వారముకడ నిలిచియున్నాఁడు. దేవర సెలవు.

ఇంద్ర.—సేవకా! శీఘ్రంబ ప్రవేశపెట్టుము.

సేవ.—చిత్తము. (అని నిష్క్రమించును.)

(ప్రతీహారియు మన్మథుఁడును ప్రవేశింతురు.)

ప్రతీ.—స్వామీ! దేవరవారి యానతి నిమ్మహామహునిఁ బ్రార్థించి వెంటఁ గొనివచ్చితి.

ఇంద్రు.—మంచిది. నీవుపొమ్ము. (ప్రతీహారి నిష్క్రమించును) కందర్పా! ఇటురమ్ము. (అని కౌగలించికొని) ఈపీఠంబు నలంకరింపుము.

మన్మ.—(కూర్చుండును).

ఇంద్రు.-శా. మారా! నేమమె నీకు నీసతికి। వే॥మారుందలంతేమమ్ము
శ్రీరామామణి నీదుతల్లి హరితోఁ॥ జెల్వారుచుండుంగదా?
ఆరామప్రియుఁడౌ వసంతునకు సౌ॥ఖ్యంబౌనె? నీమోహపుం
బారావారములోన ముంచుపని, ని॥ర్బాధంబుగా సాగునే?

మన్మ.—దేవేంద్రా! మాకందఱకును నేమంబ. కాని నావంటి పిన్నవాని నెంతయు గౌరవసహితంబుగా నాహ్వానించుటచూడ నెంతయు నాశ్చర్యకరంబుగానున్నది. మఱియు నేదియోయొక్క యుత్కృష్టకార్యంబు నాచేఁ గావలయునని నుడివితిరి. అది యేదియో వక్కాణించిన నాశక్తికొలంది ప్రయత్నించెద.

ఇంద్రు.—మన్మథా! ఇటు చూడుము.

తే. గీ. వయసునను నాకుఁ జిన్నవు॥ నయినఁగాని
యీక్షణంబున నాకంటె॥ నెక్కుడగుదు
కానఁ గార్యంపుసిద్ధికై॥ కరుణఁబడయ
దండముం జేయుచుంటిని.॥ తాల్మిఁ గొనుము.

మన్మ.—దేవేంద్రా! వలదు. వలదు. నీవేమి నాకు దండ మిడవలసినవాఁడవా? ఇ ట్లెప్పటికిని జరుగఁగూడదు మఱియుఁ గార్యసిద్ధియను నెపం బిందులకై యొకటి కల్పించితివా? నీ ఖన్నత్వముం జూచి సహింపఁజాల? నాచేఁ గాఁదగు కర్జం బేదియో సెలవీయ వేఁడుచున్నాఁడ.

ఇంద్రు.—దర్పకా! "నేను తప్పక నీవాంఛితంబు దీర్తు" నని నా చేతిలోఁ జేయి వేయుము? (అని చేయి చాచును.)

మన్మ—(తనలో) ఏమి! ఇట్లు చింతాపరీతచేతస్కుండై నన్నుఁ గూడ నమ్మఁజాలకున్నాఁడే (ప్రకాశముగా) నాకు శక్యంబైన నట్లే చేయుదును. (అని చేతిలోఁ జేయివేయును.)

ఇంద్రు.—ఉపేంద్రపుత్రా! వినుము. సాంగంబుగా వినిపించెద. తారకాసురుంగూర్చి వింటివికదా! ఆతని త్రిలోకజయంబులు—ఆతని బీభత్సకార్యంబులు—ఆతండు గావించిన యవమానంబులు—వాని దుష్కృత్యంబులు?

మన్మ.—ఆఁ! వినియున్నాను. ఎఱింగియున్నాను. కొంచెమైన ననుభవించియున్నాను. ఆతఁ డెన్నియోమారులు, నన్నడ్డగించి యిడుములం గుడుపఁజూచెను. కాని దైవసాహాయ్యంబునను, నాశాంబరీ విద్యవలనను, నింతవరకు నావంత నావంతమైన నొందలేదు. కాని యిఁకముందుముం దటులఁ దప్పించుకొనుటకు వీలుకానట్లు తోచుచున్నది.

ఇంద్రు.—ఆతనిం బరిమార్చుట కెన్నియోయుపాయంబులంబన్నితిని. ఎంతమందినో గూఢచారులం బంపి, యాతని సైన్యంబును దునుమాడఁ జేసితిని. ఎందఱనో దేవవేశ్యలం బంపి వారికి వశ్యుఁ డగునేమో యని చూచితిని. — ఎన్ని తెన్నుల యత్నించినను అవి యన్నియు నిష్ఫలంబులై చనియె. అందుచేత నొక్కనాఁడు దిక్కుతోపక యొక్కయుపాయం బాలోచించి దిక్పాలకు లందఱతో బయలుదేరి.

చం. ఎద నొకటాయిఁ జేసి, యొక • యింతయు సిగ్గునులేక డాసి,యా
చదువుల వేలుపుం గదిసి • సాగిలిమ్రొక్కుచు విన్నవించితిౕ
'వదలక తెల్పుఁడీ దనుజ • పాంసనుఁ డీల్గునుపాయ మెద్దియేౕ
నదయత' నన్న; నాతఁడు వి • శాలమనంబునఁ జూచి యిట్లనెౕ.

మన్మ.—దేవేశా! మంచిపనిఁ జేసితివి. ఏమనిచెప్పెను?

ఇంద్రు.—దక్షయజ్ఞధ్వంసమునకుఁ బూర్వమే తండ్రిచే నవమానింపఁబడిన దాక్షాయణి తన శరీరంబు యోగాగ్నికర్పించి తిరిగి రెండవ జన్మంబున లోకప్రసిద్ధులైన మేనకాహిమవంతులకుఁ బుత్త్రికగ జనించెనఁట.

మన్మ.—అగు నగును, వినియుంటిని.

ఇంద్రు.—అంతటఁ బార్వతి బాలయయ్యుఁ దన పూర్వభర్తయైన మహేశ్వరునే పరిణయంబుఁ గావలయునని ప్రతినబట్టి తలిదండ్రుల మెప్పించి పతిని గాంచువఱకుఁ దపంబుఁ గావించుచున్నదఁట.

మఱియు నంతకుముందు నిజసతీ వృత్తాంతంబు వినినవాఁడై యెంతయు దుఃఖించి శివుండుగూడ సమాధినిష్ఠం దేజరిల్లుచుండెనఁట. ఇప్పు డీ తారకాసురాసురుని నిర్జించుటకై వీరల యిద్దరి యొక్క సంగమం బావశ్యకంబు. ఇక్కార్యంబు బ్రహ్మవిష్ణ్వాదులకుఁగూడ నశక్యంబఁట.

మన్మ.—(మందహాసముతో) సరే! బాగుగనే యున్నది. సర్వజంతుజాలంబుఁ గల్పించు మహానుభావుండగు బ్రహ్మయు, శిష్టజనరక్షకుండు, దుష్టజనశిక్షకుండు, మాయామోహనవిగ్రహుండునగు విష్ణువును నశక్యంబనిన కార్యంబు నావలన సఫలంబగు నను మాట కల్ల. ఏల యింతటిమాటలు?

ఇంద్రు.—నీ వెన్నిమాటలు సెప్పినను నీ పని నీ వలనఁ గాక పరులవలన నెన్నఁడు గానేరదు. ఎట్లన నీవు సెప్పినట్లు సకల జంతుజాలంబును దన మాయోపహతులనుగాఁజేయు శ్రీలక్ష్మీనాయకుండుగూడ నీ కామతంత్రవ్యాపారంబునకు లోఁబడవలసినవాఁడేకదా? అందువలన నీ శంబరవిద్యాప్రభావంబునన వారిద్దఱకు సంగమంబగు. వారి సంగమంబునఁ గలుగు కుమారుండె యుత్తారకు నత్తరణికొమరుపోత్తునకుఁ బరపువాఁడు. ఈ విధంబున మా ప్రాణంబు లన్నియు నిప్పట్టున నీ యధీనంబులై యున్నయవి. ఇంక మమ్ము రక్షించు భారము నీయదియ. నేఁటినుండియు మేము నీ పాలంబడితిమి. ఏమిచేసినను సరే!

మన్మ.—దేవతానాయకా! నీబుద్ధిచాతుర్యం బంతయు నీ సంభాషణంబున ధారవోసితివిగదా! నన్నుత్సాహపరచుటకై యెన్ని మాటలు పల్కితివి! చివరకుఁ జెప్పిచెప్పి నన్నొక యసాధ్యకార్య

గర్తంబునఁ బడవైచితివే? నే నేమిటి? ఆపరమేశ్వరుని తపోభంగంబుఁ గావించు టేమిట?

ఉ. అంటినఁ గందు పూవులొకయైదట బాణము, లంతకంటె మి
న్నంటిన తోడుఁ, జెల్లపయినంటి నటించెడు వాహనంబులుం,
దుంటల విల్లు, పూఁదిరుగు తుమ్మెద నారియుఁ, గల్గు నే నెటుల్
మంటలఁగ్రక్కు శూలిని సమాపతి గెల్వఁగ నేర్తు నక్కటా!

మఱియు,

తే. గీ. శూలపాణియు సాధ్యుఁడే? చూపులందు
నగ్నికణములఁ గ్రక్కెడు నమరనాథ!
కోపమునఁ గన్నుదెఱచినఁ గూలిపోఁడె
యెవ్వఁడైనను? గావున నెద్దితెరవు?

అమరేంద్రా! భవాదృశు లందఱు నావలన నీకార్యంబు సాంతంబుగావలెనని యాసలు పెట్టుకొనియుండుటచూడఁ "గుక్కతోఁక బట్టుకొని గోదావరి నీదఁదలఁచినట్లు" గనుపట్టదా?

ఇంద్రు.—మదనా! ఎంతమాటాడితివి? కామశక్తిసంపద్యుక్తుండవగు నీవే వారలసమాగమం బసాధ్యంబని నిరాశావచనంబులు వల్క నింక నీముజ్జగంబుల నెవ్వరు సమర్థులు? అది యటుండ నీయగ్రజుండగు బ్రహ్మకూడ నిక్కార్యంబు నీవలననే సఫలంబగునని నొక్కివక్కాణించె. ఆమహామహువాక్యంబు లసత్యంబులే? ఆయనపల్కులనైన మనంబునఁ దలపోయుము. అప్పుడైన నీకీపని సాధ్యంబగునేమో?

మన్మ.—గోత్రారీ! ఐన నీమాటలయందు మాత్రము నాకంత గౌరవము లేదని తలంచితివా యేమి? నీవు మాకడవాఁడవె కాని కడవాఁడవే? నీవుమాత్రము నాకుఁ బితృసమానుఁడవు కావా? సమానుండ వననేల? జనకాగ్రజుండవేకదా? అట్టిచో నీకోర్కె దీర్పఁబూనకుందునా? మఱియు నిందువలన సకలజనముల కష్టంబులం దీర్చినవాఁడ ననుశాశ్వతకీర్తి గడించినవాఁడ నగుదుగదా,

ఇంక సందియంబంద నేల? నాసర్వశక్తుల వినియోగించి తప్పక యీపని నెరవేరునట్లుచూచెద.

ఇందు్రి.—మన్మథా! వేరు చెప్ప నేల? మాప్రాణరక్షణార్థివై నీవీ పని గావింపవలయు. ఇదియే నా ముఖ్యమైన తుది ప్రార్థనము. (అని తల వంచును.)

మన్మ.—విబుధనాయకా! ప్రార్థనకు నవసర మేల? ఆజ్ఞాపింపఁదగు మీ రిట్లనకుఁడు.

ఉ. నీదుసుతప్రలాపముల ♦ నీకు క్షమింపఁగఁ జెల్లునేకదా?
నాదుకళాప్రవీణత ఘ ♦ నంబుగ మీకని ధారవోసి, యే
మేదురభక్తిఁ బార్వతిని ♦ మేచకకంఠుని గూర్తు నొక్కచో
ఖేదము డించు, ప్రాణము తెగించితి నిప్డుడ పోయివచ్చెదన్.

ఇందు్రి.—వత్సా! నీయంగీకరణంబున సంతుష్టాంతరంగుండనైతిని. నీకు జయమగుగాక. పోయిరమ్ము.

మన్మ.—మంచిది. అట్లే పోయివచ్చెద.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

---

౩వ రంగము.

[రతీ మన్మథుల ప్రవేశము.]

మన్మ.—రతీసతీ! అమరేంద్రనియోగంబైన కార్యంబు నెఱుంగుదే?

రతి.—ప్రాణనాయకా! నాకుఁ దెలియదు. అద్దాని నెఱింగింపుఁడు?

మన్మ.—రమణీమణీ! నే నిప్పట్టున వెళ్ళి యుగ్రతపోనిష్ఠయందున్న పార్వతీపరమేశ్వరులఁ గామతంత్రింబునకుఁ బాలొనరింపవలయు. ఇదియే మహాకార్యంబు.

రతి.—ప్రియా! ఇందువలని లాభం బెయ్యది?

మన్మ—లోకకంటకుండగు తారకాసురు మరణంబ ఫలఁబు.

రతి.—నాథా! అది యెట్లు?

మన్మ.—వారల పొందువలనఁ గలుగు కుమారకుండె తారకునకు మారకుండయి వానిని గృతాంతనికేతనంబున కనుపు. అందువలన నే నాపనికై పయన మ్మగుచుంటి.

రతి.—మనోవల్లభా! ఈదిన మెందులకో భవద్వచనంబులు నాకర్ణపుటంబులం బడినప్పటినుండియు నా చిత్తం బుత్తలంపడియెడు. మఱియు నా ఫాలాగ్నినేత్రునికడకుఁ బోవలయునని సెలవిచ్చుచుంటిరి. భావికాలపరిస్థితుల మన మెఱుంగనేరముగదా? ప్రయాణకాలంబున భయంబుగూడ దుశ్శకునం బని పెద్దలు వలుకవిందుము గదా? ఎందులకో నాకు భయము వాటిల్లుచున్నది.

మన్మ.—కలికీ! ఎప్పుడునులేని భయం బిప్పు డెట్లు కలుగుచున్నది? ఇది యంతయు చిత్రింబుగా నున్న దే? అదియునుంగాక.

చ. అనిశము సర్వలోకముల♦యందలి పక్షిమృగేంద్రసంతతిన్
మనుజగణంబు మేనులను♦ మామకమార్గణరాజిచేతఁ బీ
డన మొనరించునాఁడ నిట♦ డాగి భయంపడనేల యిప్పు డో
వనరుహపత్రనేత్ర! మదిఁ♦ బాయుము భీతిని, నీతిగా దిఁకన్.

రతి.—త్రిలోకసుందరాకారా! రమాకుమారా! వినుము. నీవు చెప్పినట్లు కామవిద్యామృతంబు నీకు నుగ్గుబాలతోఁ బోయఁబడినదే? అందువలన నీముజ్జగంబుల నిన్ను జయించినవారు లేరని యెఱుంగుదు, ఐన నెందులకో నామనంబు బిత్తరపోయెడు.

మన్మ.—అందుల కిప్పు డేమనియెదవు?

రతి.—నాథా! ఇప్పు డీ పని చేయుమని నీకు సదభిప్రాయ మీయ నే నెంతటిదానను? చూడుఁడు.

సీ. భక్తులహృదయంబు♦ బాయకుండెడువాఁడు
లోకనాథుఁడు చక్రి♦ నీకుఁ దండ్రి
సర్వదేవతలచే♦ సన్నుతుల్ గొనియెడు
లోకజనని లక్ష్మి♦ నీకుఁ దల్లి

అణువులు మొదలుగా • నన్నిజీవుల వేడ్క
విరచించువిధి నీకుఁ • బెద్దవాఁడు
పాపపంకఁబులఁ • బాయఁగాఁ జేసెడు
నట్టి జాహ్నవి నీకు • నగ్రిజాత

తే. గీ. ఇట్టి సద్వంశమునఁ బుట్టి•నట్టి దొరవు
కామవిద్యాప్రవీణుండ•వై మసలిన
నీకు నిది యుక్త మని పల్క • నాకుఁ దగునె
సుగమమేకదా యిది నీకు • సూనబాణ!

కాన నా ప్రార్థనం బేమన, నీనాటి కీ యుద్యమమునుండి మరలుఁ డనియే; ఏల యన?

సీ. వినుము బంగరుగట్టు•విల్లువాఁ డాతండు
చెఱకుతుంటలవిల్లు • చేత నీకు
వెన్నుండు బాణమై • యున్నవాఁ డాతండు
పూవు లై దమ్ములై • పొల్చె నీకు
నాఁగుబాములతేని•నారివాఁ డాతండు,
నాలితుమ్మెదదిమ్ము • నారి నీకుఁ
బలువేల్పుమూకల•బలము వాఁ డాతండు
చిలుకకోయిలగుంపు • బలము నీకు

తే. గీ. వరుస విరసంపుఁజూడ్కుల•వాఁ డతండు
పరగ సరసంపుఁజూపుల•వాఁడ వీవు
పశుపతి యతండు, మఱి రతి•పతివి నీవు
కాన నతఁడేడ నీవేడ? • కదన ముడుగు.

మన్మ.—ప్రేయసీ! ఎంత పిచ్చిదానవే? ఆతఁడు ఫాలాగ్ని నేత్రుండనియు, నీకు భయము కల్గుచున్నదనియు, లోకశ్రేయోదాయకం బగు నా ప్రయత్నంబు మానుదునే? చూడుము.

(కోపము నభినయించుచు)

శా. ఫాలంబందున నగ్ని నేత్రమును సంబద్ధంబు గావించె నం
చాలక్ష్మీపతిమిత్రుఁ జూచి భయ మేలా? నాదు మోహాబ్ధిలో
గీలింగూడను శూలఁద్రోయుదును నాకీలాళిమాటేల? స్వా
హాలోలుం డతఁ డౌనకాద? నవకళ్యాణీ రతీమానినీ!

మఱియు నిది యొక్కనికొఱకుఁ గాదు. ఇందువలన సమస్తదేవ
తలు సుఖింతురు. సమస్తలోకవాసులు సంతోషింతురు. దీన నక
లంకకీర్తిం గడింపఁగలను. కాన నన్నాటంకపెట్టవలదు.

రతి.—నాథా! కోపము వీడుము. నీవంతటి శూరుండవే? అదిగాక
యిటు చూడుము.

తే. గీ. అదరుచున్నది నా దక్షిణాక్షి యిపుడు
మనమునను గూడ భీతియు నినుమడించు
నిట్టి యపశకునంబులఁ బట్టి నిన్ను
నాగుమంటిని నచ్చటి కఱుగకుండ.

ఇట్టి దుశ్శకునంబులు గన్పట్టుతఱిం గార్యసిద్ధులు చేకూర వను
పెద్దలవచనంబులు రిత్తయగునా? అందున నేనిట్లు బలవంతపెట్ట
వలసి వచ్చినది. ఇదంతయు నీవొప్పుకొనవేని, నా కోరిక
యొక్కటి తీర్పుము.

మన్మ.—సఖీమణీ! ఏదియో చెప్పుము, వీలైనఁ దీర్చెద.

రతి.—ప్రాణసఖా! చాలదినములనుండి యమ్మహేశుని నొక్కసారి
సందర్శింపవలయునని కోరికి గలదు. కావున నన్నుఁగూడ నీవెంటఁ
దీసికొనిపొమ్ము. ఇంతియు నా ప్రార్థన.

మన్మ.—సుదతీ! ఎంత బేలవే? నాతోడ వచ్చెదవా? అక్కాననంబు
విహారవనం బనుకొంటివా? కామస్వరూపులకే యగమ్యంబు.
చూడు మా ఘోరకానన రామణీయకంబు.

సీ. నవకోరకితచూత • నమ్రశాఖలుగావు
గగనచుంబిమహీజ • గణము గాని
పికశారికాదుల • ప్రియవదంబులు గావు
తతఘూకభయదనా • దములుగాని

చెంగుచెంగని దాటు • జింకపిల్లలు గావు
ఘనతరవ్యాఘ్రసం • ఘములు గాని
ఘుమఘుమాయించెడు • క్రొందేనియలు గావు
మత్తదన్తికపోల • మదము గాని

తే. గీ. ఇట్టి బెట్టిదపుంగాన • లట్టె చొచ్చి
యనలనేత్రుని గాంచి యో • యబల! యెట్టు
లోర్తు? కావున నీరాక • యుచితమా నె?
చర్చ నేయగ నవఫుల్ల • జలజనయన!.

ఇంద్రునంతటివాఁ డడుగ నక్కార్యంబున కంగీకరించి వచ్చి యిప్పు డిక్కారణంబులచేత భయంపడుట నాకును నాతనికిఁ గూడ హాస్యాస్పదంబు గాదె? మరియు నావిషయంబున,

తే. పూర్వజన్మంపుసుకృతాఘ • ములు సమముగ
నరసి తత్ఫలములఁ దత్త • దాస్యములను
వ్రాయుఁగాని సోదరుఁ డని • వ్రాయకున్నె!
నాదుఫాలంబున విరించి • నలిననేత్రి!

కావున దైవసంఘటనకు మారులేదు. కష్టంబులఁ బాయ వచ్చు నని నీవు నా వెంట నడవులకు రావచ్చునా?

రతి.—నాథా! నిక్కంబేకాని యాపదఁ బాపుకొనలేమని యెడు దృఢ నమ్మకమున నుండి కఱచుటకై డగ్గరుచున్న దుష్టసర్పముంజూచి యూరకుందుమా?

మన్మ.—సరే పోనిమ్ము! ఎవ్వరైన ముం దెప్పుడో కష్టములు వచ్చు నని యే పనియుఁ జేసికొనక యూరకుందురా? ఇట్టి యభిప్రాయంబులు నీ హృదయపీఠమునుండి త్రోసివేయుము. ఇంక నేఁ బోయివత్తు.

రతి.—ప్రాణవల్లభా! ఇంక నే నేమి మాట్లాడఁగలను? నీ యిష్టము వచ్చినట్లు చేయుము.

మన్మ.—రమణీమణీ! నీ హృదయక్షేత్రంబునఁ జింతాంకురంబుల మొలసు లెత్త నీయకుము. నా కేమియు నపాయంబు రాఁబోదు. నేను వెళ్లి సాయంతనం బగునప్పటి కే వచ్చెద. అప్పుడు సుఖంబుగ నిష్టభోగంబులఁ దుష్టిపఱచెద. ఏదీ నీ చెక్కుటద్దంబుల నొక్కసారి ప్రతిబింబంబులఁ జూడనిమ్ము. (అని ముద్దుల నిడుకొని)

అహో! వేడికన్నీటిచే వాడియున్నావేఁ? ఇంత దిగులేల? అటులైన నా వెంబడినె రమ్ము. ముక్కంటిపాటియు నా పూవుటమ్ముల ధాటియు నూటిగాఁ గనుఁగొందుగాక.

రతి.—ధన్యనైతి. ధన్యనైతి. ప్రాణప్రియా! పోదము రండు.

(అని నిష్క్రమింతురు.)

---

## 4 వ రంగము.

(శివుండు తపంబుచేయుచుండ మన్మథుండు వచ్చును.)

మన్మ.—(తనలో) ఆహా! విధినియోగం బగుకార్యం బెవ్వరికిని నలంఘ్యంబు గదా! (నలుఁగడలు దిలకించి) ఇప్పటి కీకాననంబున కే తెంచితి. (శివుని వైపు తిరిగి) ఆహాహా! ఎంతటి బ్రహ్మతేజంబున వెలుఁగుచున్నాఁడో! చూడుమా! మానసమా! తొందరవలదు. ఇట్టిమహానుభావు నాలోకించుమాత్రముననే సర్వాఘంబులు నశించుననఁ గీర్తించినం జెప్పవలయునే? భవిష్యత్కార్యసిద్ధికై యొకమారు ప్రార్థించెదఁగాక

చం. పొలుపుగ దేహమంతటను ♦ బూదియునొక్కకరాంబుజంబునం
దలరఁగ శూలముం గలిగి ♦ యవ్వలిహస్తమునందు సర్పమా
లలను ధరించి బ్రహ్మమును ♦ లక్ష్యముగాఁ గొని సర్వదేవతా
ళులకును గీర్తనీయుఁడగు ♦ లోకపవిత్రు దిృనేత్రు నెంచెదన్

(చేతులు జోడించి—ప్రకాశముగ)

దండకము.

గుహజనక! సురస్తోమసంసేవ్య! సద్భక్తసంభావ్య! సర్వాఘకాంతారవాతప్రియా! శైలకన్యాప్రియా! నీదురూపంబు సూడన్మనం బద్భుతం బందెడిన్ దేవదేవా! సురల్ నన్ను వేడంగ నేతచ్ఛుభం బాత్మలోఁ గోరి యుష్మత్తపోభంగదుష్కృత్యముల్ సల్పఁగా బూనుకొంటిన్ నన్నున్ నీదు భృత్యుండుగా నెంచి, మద్దోషముల్ సైచి, కోపం బొగిండించి, యుష్మత్కృపాదృష్టి నీక్షించి, కాపాడవే! దక్షయజ్ఞాంతకా! శూలపాణీ! నమస్తే నమస్తే నమస్తేనమః

(తనలో) ఏమీ! ప్రార్థనావశంబున వచ్చినకార్యంబు మరచితినిగదా? చేయునది మహాకార్యము. ఇందులకు నామిత్రులెంతయు నాకు సాహాయ్యము చేయుచున్నారుగదా! ఆహా!

సీ. ప్రియమిత్రుఁ డొంటను ♦ బ్రేమ వసంతుండు
రాజిల్లఁగాఁ జేసెఁ ♦ బ్రమదవనము
వేడుకచెలికాఁడు ♦ వీవఁగాఁ దొడఁగెను
మందమందంబుగా ♦ మారుతుండు,
కామ మెచ్చఁగ మేన♦మామ చంద్రుఁడు శీత
కిరణముల్ జొపి మి♦క్కిలిగ వెలిఁగెఁ
బికశారికాదులు ♦ భృంగావళిం గూడి
చెలువుగా గానమ్ము ♦ సేయుచుండె
తే. నన్ని తెఱఁగుల నిట్లు స♦హాయపడఁగ
నున్న హేతువునను నేను ♦ తిన్నగాను
పూవుటమ్ములఁ బఱపుదుఁ ♦ బూవుఁబోఁడి
యెడల రాగంబు గల్పింప ♦ నిదియె యదను.

(ప్రక్కకుఁ జూచి) దేవీ! నీవీ పొదరింటనే యుండి చూచుచుండుము. ఫాలనేత్రునిమెట్టయెదుటికి రాఁదగదుగదా!
(ముందువంకఁ జూచి స్వగతము)

చ. కదువడి నీటుగా నెడమ♦కాలును ముందుకుఁ జాచి వేడ్కమై
నెడమకరాననించువిలు ♦ నేర్పడఁబట్టి ప్రసూనబాణముల్

తొడిగి మదాలి నారి పెను। తొందరతోడను లాగి లక్ష్యము౯
మృదుని యెడంద నిల్పి కయి। నేరుపు గన్పడఁ బారువెట్టెదన్.

(అట్లు చేసి) ఏమీ! నా బాణపాతంబున కీతం డేమియుఁ జలించి నట్లు కానంబడ దే? (ఆలోచించి) ఔనౌను! మహాతపోబల సంపన్ను లీ పుష్పసాయకంబుల కేస్పందమందుదురా? ఐన మఱొక్కటి విడుతుఁగాక.

చ. వెఱనక గట్టుపట్టిబొమ। నిల్లుగ మారిచి వాలుచూపుల౯
జుఱుకగు సాయకమ్ములను। జొన్పి బెడంగగు మేనుదీవయన్
గఱకగు నారి లాగి మును। కై వడి కై వడి బూర వైతు నో
యరనెలదారి! నీదుహృద। యాంబుజ మేగతిఁ గాచికొందువో!

(అని బాణమేసి నిట్టూర్పు నిగుడించి) కట్టా! ఇదికూడ వ్యర్థమైనదే? ఏమి చేయవచ్చు? ఎట్టిమానీంద్రులైనఁ గామాంధు లగుచుండ నీతం డట్లు గాకున్నాఁడు. ఒక్క బాణముగాదు - రెండుబాణములుగూడ వ్యర్థములై నవే? ఐన వేఱొక యాశుగంబు బరపెదఁగాక. శంకరా! భవనాశంకరా!

చ. తొలుకరిమించుమించుమెయి। తోఁగఁ బువిప్పగుకన్నుదోయితో
కలకల నవ్వునెమ్మొగము। కాంతులతో నలుపారు వేణితోఁ
బలుకుల చాన దోఁపఁగ। జపంబునుమాని కొమార్తెఁ బైకొనం
దలఁచఁగ నల్వపైనిడిన। నారన మియ్యది నమ్ము నెమ్మది౯.

(అని మఱొకటి విడుచును.)

ఓహో! ఇదేదియో చిత్రంబుగా నున్న దే? ఏమీ! మూఁడు నారాచంబులనైన నితని మనంబునఁ గాపంబు పొడమకున్న దే? ఇది చూడఁగా నే నాచిత్తంబున నుత్తలపాటును దత్తరపాటును బెనగొనుచున్న వే? ఏమిసేతు? నా కింక నేది కర్తవ్యంబు? పురుషకారంబున్న గాని దైవసాయంబు కాదుగదా? "షడ్భాగం మనుజయత్నానాం సప్తమం దైవచింతనం" అనిరి, కావున నే జీవించి యుండువఱకుఁ బరమేశ్వరతపోభంగయత్నము చేయవలసిన దే.

హరా! భవహరా!

ఉ. బాలమృణాళనాళముల • బోలిని నేలెడు కేలుఁదోయితో
మేలిమిపాలవెల్లిమిసిమింం దలదన్నినమేనికాంతితో
బాలమరాళయానమున • భాసిలులక్ష్మిని సక్కఁ జేర్చఁగాఁ
గేలిటు జాచఁజేసి హరి • గెల్చిన దీవువుఁదూపు నమ్మమా!

ఇదేదియో ప్రళయసమయంబుగా నున్నదే? లేకున్న నాయమోఘాస్త్రంబులు రిత్తవోవునే? ఎంతటికాలవైపరీత్యంబు? నాపంచపాణింబులఁ గ్రోణినేయుబాణంబులలో నాలుగింటిని బంపించి ప్రయత్నించితి, అంతయు వృథయయ్యె. ఏమి కారణమైయుండు? నాపతంగంబులు శస్త్రంబులుగూడ కావే? "అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్" అను నార్యోక్తి యెట్లు పొల్లగు? కానిమ్ము. నేనా యిందుమౌళి మొగ మెట్లు చూతు? ఏమనిపోయి రతీదేవితో సుఖింతు? ఈశనితపోభంగమునకై తెలుపు కానంబడకున్నదే?

ఉ. ఎక్కడివాఁడనో యిటుల • నింద్రునిచేతను బ్రార్థితుండనై
యిక్కడి కెట్లు వచ్చితినో? • యీశుని గెల్వఁగ నూనసాయకా
లొక్కటి యొక్క టిక్కరణి • నుక్కఱి దిక్కఱ నిష్ఫలంబులై
యక్కట! పోయె నింకెటుల • నాహరిఁ గన్గొని సంతసించుటల్.

(అని తల వంకించి) కానిమ్ము. దేవకార్యముగాని, మానుషకార్యము గాదుగదా? దైవ మెట్లు చేయఁదలఁచెనో యట్లు చేయనిమ్ము. ఈ వైదవబాణముగూడ విడిచి చూచెదఁగాక.

కృతాంతహంతా! జగన్నియంతా!

చ. దనుజులఁ గేడి వేలుపుల • దగ్గరఁ జేరి సుధారసంబునుం
జనవునఁ బోయఁ దాలిచిన • చానమెయిం గనఁ జేయుమన్న మోహనుఁడగు శౌరిచూపినప్రి • యంబగుసుందరమూర్తిఁ గాంచి నీ
తనువునఁ జీరజారునటు • తార్చినయ ట్మిది నిం గదల్చుతన్.

(అని బాణము విడుచును.)

శివుఁడు.—(కొంచెము శరీరము కదలించును.)

మన్మ—ఆహా! ఇప్పటికి నాప్రయత్నము ఫలించినది. ఇంక నాకుఁ జింత తీరినది. తపోవిఘ్నంబైనది. ఇంతట రాగం బంకురింప వచ్చు. (పరికించి) నన్నుఁ జూచి కోపగించుకొనునేమో? రౌద్ర రూపంబున నున్నట్లున్నాఁడే! కొంచెము దృష్టిగోచరుండనై యతని చేష్టలం దిలకించెదఁగాక. (అని తమాలసాలము చెంత నిలుచును.)

శివుఁడు.—(రౌద్రాకారముతోఁ గన్ను లెఱ్ఱజేసి) ఆ! ఎవఁడురా వాఁడు? దుర్మదాంధత్వమునఁ గన్నుఁగానక, కన్నుమూసికొని తపంబుగావించుకొను నాజోలి యేల? నాతపం బీతని కేమిహాని గావించెనో! ఎన్ని నాళ్లనుండియో తపోనిష్ఠ నుంటిని గాని యెవ్వాఁడును నన్నడ్డగింప లేదే? "గ్రుడ్డు వచ్చిపిల్లను వెక్కిరించినట్లు" నన్నితం డెవ్వఁడో చెఱుపఁ దలంచినాఁడు. ఏమి కాలవైపరీత్యము! తపోధనులకు విఘ్నంబుఁ గావించువారుగూడ నీజగంబునఁ గలరా? (కొంచెమాగి) మచ్చండతరనేత్రాగ్నిం జూచియైన భయపడలేదుగా? ఎంత ఘోరము! ఎంత దారుణము! (బొమలు చిట్లించి) ఎవఁడో మనుజుండువలె నున్నాడే! చూచెదఁగాక (అని తొంగిచూచును.)

మన్మ—ఓహో! ఇయ్యనఘుని మనస్సు తపస్సునుండి మరలినది. ఇఁక నే నీ తమాలసాలంబుమ్రోల నిలిచి బాణముఁ బరపెదఁ గాక. (అని దాగును.)

శివు.—ఓరీ! ఎవ్వాండవురా నీవు? కర్తవ్య మెద్దియో కావించి మూలలం దూరెదవేమి? బయలుపడుము. మఱియిటు చూడు. ఓరీ!

మ. ఖలుఁడా! క్రూరుఁడ! మత్తపంబునకు విఘ్నంబీవుగావించి తీ
వలదుర్గాటవులందు దూరినను నయ్యంభోధియందుం ధరా
తలముం జొచ్చినఁగాని వీడుదు నే నేత్రస్థాగ్ని నిన్గాల్చి త
త్ఫలముంగాంచఁగఁజేతు, బిల్వ నినుగావంజాలువాఁడుండినన్.

(తనలో) ఓహో! వీఁడే మత్తపోభంగకారకుండగు. (ప్రకాశముగా) తాపసతపోభంగఫలం బిదె యనుభవింపుము. (అని యటు తిరిగి మూఁడవకన్ను దెఱచును; మన్మథుఁడు భస్మమగును.)

(తెరలో)

హా! నాథా! పంచబాణా! ఎంత మోసపోయితివి? ఒక్క గడియలో నీప్రతితివికదా? ఇంక నాకన్నులకుఁ గాన్పింపవు కాఁబోలు? ప్రాణనాథా! అపశకునంబులు గన్పట్టుచున్నవి. వలదన్నను వినక వచ్చితివిగా? ఈవిరూపాక్షునిచేత నీకీయాపద కల్గినదా? ఏమి ప్రాణేశా! మాట్లాడవేమి? లేచి నన్ను సంతసంబునఁ దేల్పవా? ఐనను శివుండు

చ. ఖగములు నాక, దుష్టమగు ♦ కానమెకంబులు నాక, కూ్రరప
న్నగములు నాక, దుర్గమవ♦నంబులు నాక, భవానిపోకకై
నగములుపట్టి కట్టి తిన ♦ నారలు కూరలు గాఁ దపంబుతో
నగమయినట్టివానికిని ♦ జానను గూర్చిన నింత సేయునే?

మనోనాయకా!

సీ. పుట్టింపఁ గలశక్తిఁ ♦ బూని యాయువు తక్కు
వైన నీయంగలాఁ ♦ డన్న కలఁడు
పోషింపఁగలశక్తిఁ ♦ బూని యాహారంబు
తెలుగ నీయఁగలాఁడు ♦ తండ్రి గలఁడు
భోగింపఁగలశక్తిఁ ♦ బూని భోగంబులు
తెలుగ నీఁగల పెద్ద♦తండ్రి కలఁడు
సర్వసంపచ్ఛక్తిఁ ♦ జరియించి సంపదల్
తెలుగ నీఁగల కన్న♦తల్లి కలదు

ఆ.వె. ఎంద ఱున్ననేమి ♦ హేమాద్రిధన్వుండు
మేనయత్తమగఁడు ♦ మేనమామ
కాఁ డటన్నమాట ♦ కారణమ్ముగ నిన్నుఁ
గంటిమంటఁ గాల్ప ♦ గెంటినారె?

శివు.—(శ్రుతి నభినయించి) రతీదేవిభాషణంబులవలె నున్నవే? ఇప్పుడీ దగ్ధగాత్రుండు రతిపతియేనా యేమి?· అగు నగును. కాకపోయిన నిట్టికామోద్దీపనంబులైన చిహ్నంబు లెట్లు చూపట్టును? పాపము!

రతీకాంత యెట్లు చింతించుచున్నదో! తపోభంగజనితరోషంబున నెంతటి యకార్యంబుఁ గావించితిని? తామసగుణం బెరికేని త్యాజ్యంబుగదా? ఆగుణంబున నేనే యిట్టి దుష్టకార్యంబు చేసితినే? పెరవారి ననుకొననేల? ఇంకేమి సేతు? గడించినతపోధనము పోగా నీయెడ కాంతాదుఃఖకారి యగు నావిలంబుగూడ నాకుఁ జేకూరినదే! ఐన నీలాగున ననుగ్రహించి నాకలుషంబు కొంత తగ్గించుకొందుంగాక. (నేపథ్యమువంకఁ దిరిగి ప్రకాశముగా) ఓరతీదేవీ! నీభర్త మన్నేత్రాగ్నిదగ్ధుండయ్యు మదనుగ్రహంబున ననంగుండై నీయక్షిపథవర్తియై నిన్ను సుఖంపఁ జేయుఁగాక. ఇంక దుఃఖంబు వీడి వీడికోలందుము.

(తెరలో)

సంతోషము—సంతోషము!

ఉత్సాహ. దేవ! దేవదేవ! వామ♦దేవ! దీనపోషకా!

నీవ కావకున్న నాకు ♦ నిక్క మిందు నొక్కఁడేఁ
గావఁజాలువాఁ డెవండు? ♦ కాన భర్త నిచ్చి నన్
గావఁగల్గినావు నీదు♦ కాలి కేను మ్రొక్కెదన్.

తండ్రీ! నాము త్తైదువతనంబునకుఁ గొఱతరాకుండఁ జేసితివి. ఇదే నమస్కారము, పోయివత్తు.

(రతీమన్మథులు గలిసికొని వెళ్లుదురు.)

శివు.—(వటవృక్షచ్ఛాయం గూర్చుండి)— (తనలో) ఇప్పటికి నా స్వాంతంబు శాంతించినది. (తలయూచి) కాని యింతకు నా తపోభంగకారణంబు బోధపడదయ్యె. ఇంకఁ గర్తవ్యం బేమి? తపంబాచెడిపోయె. మనంబా-చికాకుపడియె. (శరీరమువంకఁజూచుకొని) ఏమి చిత్రము! పులకాంకురంబులు పొడకట్టుచున్నవే? దీనికిఁగారణం బేమైయుండును? ఎప్పుడు నిట్టి కామోద్రేకకరంబులైన చిహ్నంబులు గన్పట్టుచుండుటలేదే? ఈ దినం బీవనం బంతయు కామోద్దీపన లక్షణంబులతోఁ దులదూగుచున్నదే? యోగదృష్టిం గనుంగొనెదఁగాక. (ధ్యానము నభినయించి) ఓహో! తెలిసినది. తెలిసి

వది. తారకాసురుం డనువాఁడు ముల్లోకంబులను బాధించుచుండ నా నిబిడాజుండగు బిడౌజుండు పితామహునివలన సర్వంబు వ్యక్తంబు గావించుకొని నవమోహనాకారుండును, గామవిద్యా పారంగతుండు నగు విష్ణుపుత్రు నిందులకై పంచె. ఇంతమాత్రము శాంతస్వాంతుండనై మొదటనే యిది యంతయుఁ దెలిసికొనిన నోతని కిట్టి దురవస్థ సంభవింపదుగదా ? ఎంత తొందరపడితిని! ఈ కృత్య మంతయు త్రిలోకసౌఖ్యమునకే కాని వేఱుకాదుగదా ! (కొంచె మాఁగి) ఏనఁ గానిమ్మ. ఇప్పు డింతగాఁ బునఃపునఃపశ్చా త్తాపంబునం గల్గు ప్రయోజనం బెయ్యది ? మఱియు నిదంతయు 'గతజలసేతుబంధనము' గదా ! కావున నో కామమా! నీవు పోయి యాహిమశైలకన్య నాశ్రయింపుము. నేనుగూడ నింక జగద్రక్షణార్థమై తత్పార్వతీసమాగమంబునకై పోవువాఁడ. (అని సాగి యదరిపడి వెనుకకుఁ జూచి) ఓహో! మన్మథా! నీ ప్రియురాలగు రతీదేవిదీనాలాపంబులు వినఁజాలక నిన్ను బునర్జీ వితుఁ జేసినందులకు నేను దీసికొనిన గోతియందు నన్నే పడఁ ద్రోయుచుంటివా ? 'తిరిగి మంటినిగదా!' అని మదంబునఁ గొట్టుకొనుచున్న ట్లున్నావే ? ఇదిగో యిటు చూడుము. ఇంతకు ముందు మన్నే తాగ్నిం గాల్చితిని. ఈ మారు నన్ను బాధపెట్టి తివా ? కోమలాంగియైన హైమవతీసమాగమంబున నీశౌర్యంబు రూపుమాపుదునునుమా ! కాచికొనుము. ఇదె బయలువెడలు చున్నవాఁడ. (కొంచె మాఁగి) నే నెచ్చటికేగవలయును ? కర్తవ్య మేమి ? చిత్తమా ! ఆగు మాఁగుము. నేనుగూడ వచ్చుచుంటి. (ఆలోచన నభినయించి) ఇంక నిట్లు గావింతునుగాక.

చ. నిరతతపోనిధానను బునీతచరిత్రను గుంతలాళినుం
దరవదనారవిందను ఘనాఘనకేశను బార్వతీసతిం
గరము దదంతరంగమును గన్గొని బ్రాహ్మణవేషధారినై
నరమునుబట్టి కేళిసుమకార్ముకుగర్వ మణంచివై చెదన్
అదియునుంగాక;

తే. మామకసమాగమంబునఁ • బార్వతికిని
గల్గుకోమరురుఁడే తుష్టింపంగ• గల్గు కక్క
రక్కసుని గాన నేగెద • రయముమీరఁ
బార్వతి వసించుచున్నట్టి•వనమునకును.

(తెరలో) తథాస్తు, తథాస్తు.

---

క. పంకజముఖగిరితనయా
శంకరవై వాహికప్రశస్తకృతిగ నై
దంకములఁ దృతీయాంకము
వేంకటకోదండపాణి • విరచితమయ్యెన్.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః.

# శ్రీ పార్వతీపరిణయము.

## చతుర్థాంకము.

### 1 వ రంగము:—పార్వతీవనము.

(పార్వతీతపోనిష్ఠాసమయమున శివుఁడు బ్రాహ్మణ వేషధారియై ప్రవేశమగును.)

శివుఁడు.—(వృక్షచ్ఛాయఁ గూర్చుండి, తనలో) ఔరా! ఏమి ఈమె జగన్మోహనాకారము? ఎన్నిదినంబులనుండియో తపంబు గావించుచుఁ గృశించి కృశించి తనయణిమత్వంబు సార్థకంబు గావించుకొనినదే! మఱియు నెంత కృశించినను స్వకీయావయవ శోభమాత్ర మొక్కలవమైనను తగ్గలేదుగదా! ఆహా! యేమి!

ఉ. ఆనగు మోము చందమును • నానును పెన్నెఱివేణిసోయగం
బానవపల్లవోష్ఠమును • నాకను దామరదోయిసొంపు పెం
పానెఱిదీవమేనుసొబ • గామదదంతిసమానయానముల్
గానక యున్నవాని కిఁకఁ • గాముని బాధలు మాన్పవచ్చునే?

అదియునుంగాక నిత్తఱి బాలిక యయ్యు నిట్టియుగ్రతపంబు గావించుచున్నదే? (అటు నిటుఁ జూచి) ఎవ్వరైన వచ్చుచున్నారా? ఎవ్వరును లేరు. ఇంకఁ గొంత సేపటికి మెచెలులు వత్తురు. ఈ లోపలనే యొక్కమారీలలనాలలామవిలాసంబులఁ దిలకించుచు నలరువిలుకానివలని యలజడి దొలఁగించుకొనియెదఁగాక. ఓ మానసమా! ఆగుమాగుము. తొందరపడవలదు. ఒక్కసారి యిటుచూడుము.

సీ. చందమామా! నీదు • చందమామాననిని
మొగముఁ జూడకమున్నె • మురిసిపాటు
జక్కవలార! మీ • చక్కందనం బార్య
కుచ్ఛము గాంచకమున్నె • కులుకుపాటు

రిక్కలారా! మీర ♦ లక్ష్యాంతనఖకాంతి
దిక్కు గాంచకమున్నె ♦ తిరుగుబాటు
అద్దంబులార! మీ ♦ నిద్దంపుఁదళ్కులా
చెక్కు నొక్కకమున్నె ♦ నిక్కుపాటు

తే. గీ. శంఖమా! నీవు సతిగళ ♦ సంపదలను
జెందఁజాలవు మున్నీరుఁ ♦ జేరియుండు
క్రోధమున నోరు నెత్తెదో ♦ కువలయాక్షి
పికరవంబున నీదగు ♦ పీచ మడఁచు.

ఇదేమి! ఇంత మోహాంధకారంబునం బడితినే! మదీయమకుటాలంకారశశాంకుండు తమోనిరోధశాలి యయ్యు నీ తిమిర పటలంబును హరింపలేఁడుగదా!

మరియు,

ఉ. భూషను బోలె నాహరిణ ♦ భూషణు మూర్ధమునందుఁ దాల్ప నే
దోషములేనివాని మరు ♦ తూపుల బాధలఁ బొందువాని నర్క
ద్వేషముచేతనో యనఁగ ♦ దివ్వెలువెట్టుచునుండె నిట్టులా
యోషనుగూడ గాఢముగ ♦ నుల్లము దల్లడిలంగఁజల్పెఁడే!

ఏమనుకొనిన నేమి ప్రయోజనము? ఈలలితలావణ్యవతీలలామను విలోకించినప్పటినుండియు నామనం బున్నచోట నుండకున్నది. ఏమి సేతు? (అటు నిటు చూచి) ఏమి? వచ్చినపని నేమరచితినే! (తొంగి చూచి) ఇదిగో! ఎవరో కాంతాయుగళంబువలె నున్నదే? (ఆలోచన నభినయించి) ఎవరో యనుకొననేల? ఈమెసఖులేయై యుందురు. అరుగో కరపద్మంబులఁ బత్రిపుష్పఫలాదికంబులం గైకొని తత్కరంబులకాంతుల కవి యొకవింతయైన సౌందర్యంబు నింపవచ్చుచుండిరి. (బాగుగాఁ బరికించి) వీరీమెకుఁ దగినవారలే! ఇదిగో డగ్గరుచున్నారు. వీరలవలన వీరైనంతవఱకు నీతపస్విని వృత్తాంతంబును దెలిసికొనియెదంగాక.

(చంద్రముఖీ పద్మనేత్రి లను నిద్దరు సఖులు పత్రిపుష్పఫలాదులం గొని ప్రవేశింతురు.)

చంద్రి.—చెలియా! ఈ బ్రాహ్మణుండు సర్వవిధాలంకరణంబువలన నపరశివావతారమా యనున ట్లున్నాఁడు. మన కాయన చాల దూరంబున నుండఁగనే నే నాతనిం జూచితిని. అప్పటినుండి నా చిత్తం బెందులకో కాని, యీతనియందే భక్తిపరవశమైనది. అది యునుంగాక యీతండు బ్రహ్మవంశసంభూతుండు. ఇతఁ డిక్కడి కెందులకు వచ్చెనో తెలియకున్నది. పోనిమ్ము. ఇమ్మహాత్మున కర్ఘ్యపాద్యాదిపూజలు నల్పి, మహత్తరపుణ్యంబు బడయుదము.

పద్మ.—కలికీ! సుకృతమే కాక యిది విన్న యెడల మన దేవేరియగు పార్వతీదేవి బ్రాహ్మణభక్తిపరాయణురా లగుటంజేసి యెంతయు ముదంబంది మన కెన్నియో పారితోషికంబుల నిచ్చునుగదా?

చంద్రి.—ఔను. అందులకు నందేహ మేమి? మన మిప్పు డాతనికి నతిథిసత్కారంబులు గావించుటయే యుక్తకార్యంబు.

(అని యిద్దఱు నాతని డగ్గరి)

చంద్రి.—(చేతులు మోడ్చి) దేవా! భవదనుగ్రిహపాత్రిమైన చంద్రిముఖి యిదె నమస్కరించుచున్నది.

బ్రా.—(తనలో) వీ రిద్దరును గన్యలవలెఁ గన్పట్టుచున్నారు. ఐన నిట్లాశీర్వదించెదఁగాక (ప్రకాశముగా) కళ్యాణసిద్ధి రస్తు.

పద్మ.—(కరములు ముకుళించి) స్వామీ! భవద్దర్శనంబున మాయ ఘంబులు ప్రళయవాతసంస్పర్శనంబువలన ఘనాఘనంబులుం బోలెఁ బటాపంచలయ్యె. ఇదిగో ప్రణామంబు స్వీకరింపుఁడు.

బ్రా.—మంగళకరకార్యసిద్ధి రస్తు.

చంద్రి.—భూదేవోత్తమా? మా దేవీరత్న మగు భూధరరాజకన్యక యీశ్వరభక్తిపరాయణురాలును దపోనిష్ఠాగరిష్ఠురాలునునై యున్నది. అందువలన మాచేతనైనంతవరకు మేము చేయు నతిథి

సత్కారంబుల స్వీకరించి మమ్మానందింపఁజేయుదు రని నమ్మి యున్నాము.

(అర్ఘ్యపాద్యంబు లిత్తురు.)

బ్రా.—(గ్రహించి) కన్యకలారా! మీవినయసౌశీల్యంబులే మీకు నాయందలి భక్తిశ్రద్ధలఁ జెప్పకచెప్పుచున్నవి. మరియు మీసపర్యలకు మన్మనంబు మోదం బందినది.

చంద్రి.—దేవా! భవదాగమనకారణం బాకర్ణింప నాశ్రవణంబులు కుతూహలాయత్తంబు లైయున్నవి. మే మెఱుంగం దగుదుమేని ప్రసాదింపఁ బ్రార్థింపుచున్నాము.

బ్రా.—సుకృతధన్యలారా! కన్యలారా! మావంటితపోధను లచ్చటచ్చటం బర్యటనంబు నేయుచుఁ దపోధన్య లైన కన్యల సందర్శించి వారలకు శుభోదర్కంబులగు వార్తలను వినిపింపవచ్చెదరు. నీకు శుభం బగునుగాక. ఆయమ నిద్రనుండి యెప్పుడు లేచునో తెలుపఁ గోరుచున్నాను.

చంద్రి.—(నవ్వుచు) అంతకంటె మాకు సంతోషకరమైన దేమున్నది. ఇదిగో! ఆమె కొన్ని నిమిషములకాలములో లేచును. అప్పుడు వక్తవ్యాంశములు పలుకవచ్చును. ఆమె దాపునకు వెళ్లుదము రండు!

(అని బ్రాహ్మణునితోఁ బార్వతిని జేరుదురు.)

పార్వ.—(కన్నులు తెఱచి, బ్రాహ్మణుని, సఖులను జూచి) దేవా! ఈ యాసనం బలంకరింపుఁడు.

బ్రా.—(కూర్చుండును.)

చంద్రి.—చెలీ! పార్వతీ! నేనును, బద్మనేత్రియు నేతత్పరిసరారణ్యప్రాంతమున కేఁగి, పత్రిపుష్పఫలాదులు గొనివచ్చుచుండ నీభూసురుండు, చూడుము! ఆయెదురుగ నుండు వటవృక్షచ్ఛాయ నాసీనుండై యుండ, మేము తెచ్చినపుష్పాదులఁ బూజించి యాతిథేయసత్కారంబు గావించితిమి.

పార్వ.—సఖీ! బాగు బాగు! మంచిపని గావించితిరి. తరువాత, తరువాత.

చంద్రి.—తరువాత నాయనమనోభీష్టం బెఱింగి యిచ్చటికిఁ గొని వచ్చితిమి.

పార్వ.—సరే! మీరు వెళ్లి తిరిగి కుసుమఫలాదులు గొనితెండు. ఇంతలో నీభూదేవునియాగమనకారణం బరసెద.

చంద్రి.—సరే! (అని పద్మనేత్రివంకఁ జూచును.)

పద్మ.— కలికీ! పోదము రమ్మా. (అని యిద్దఱు నిష్క్రమింతురు.)

పార్వ.—భూసురగ్రామణీ!

తే. గీ. నేఁడు మీదర్శనంబున ♦ నేను నాడు
జన్మదినము మొదల్ గాగఁ ♦ జల్పినట్టి
పాపకార్యంబులం గల్గు ♦ ఫల మదిప్డు
కాలి ధూమంబువోలె మే♦ఘములఁ జేరి
వాని కాధూమవర్ణంబు ♦ నఱలఁ జేసె.

మఱియు భవద్వదనారవిందంబునం దేదియో యొక్క యమందానందాంకురంబు మోసులెత్తుచున్నది. అందులకుఁ గారణం బేదియో సెలవీయుఁ డాకర్ణింపఁ గోరుచున్నాను.

బ్రా.—బాలామణీ! చిన్నదానవు. పది పండ్రెండు వత్సరములు తిన్నగ నిండనిదానవు. ఇప్పుడే నీవిట్లు సర్వవాంఛలం ద్యజించి తపంబు గావించుటను నా కద్భుతానందంబులు గలుగుచున్నవి. అంతియకాని వేరుకాదు.

పార్వ.—ఐన నిట్టితపంబునకు నేను తగనా యేమి?

బ్రా.—లలనాతిలకమా! కాదు కాదు. రాజగృహంబుల బాలికాడోలికలఁ దూలికలపైఁ బరుండి యాగవలసిన నీ బాల్యం బేల నేల పాలు చేసెదవంటిని. కాని నీ విందులకుఁ దగనిదానవన నెవరితరము!

పార్వ.—సరే! పోనిండు. దాని కేమిగాని తమనివాసస్థాన మెచ్చటనో సెలవిచ్చి యీ బాలికకోరికఁ దీర్పుఁడు.

బ్రా.—నా నివాసమా? శివనివాసమే.

పార్వ.—దేవా! తాము విద్యారాజశేఖరు లగుటచేతను, నాకు మనంబు సరిగా నుండకపోవుటచేతను, భవద్వచనంబులు నాకు విదితం బగుటలేదు.

బ్రా.—ఐనఁ జెప్పెద నాకర్ణింపుము.

ఉ. ఏవనమందు నిచ్చలును ♦ నిందుకళాంచితమస్తకుండు, నా
దేవగణేశుఁ డాదిగను ♦ దిక్పతు లందరచేత నెప్పుడున్
సేవితపాదపద్ముఁ డగు ♦ చిన్మయుఁ డుండునో, యాతఁ డేనుగా
నావనమందుఁ బర్ణకుటి♦యందు వసింతును బాలికామణీ!

పార్వ.—(సాశ్చర్యము) ధరామరవరా! మహాతపోధనుండగు పరమేశ్వరుండు నివసించువనసమీపంబున నుండెదవా? ఎంతధన్యను? నేఁ డెంతసుదినము!

బ్రా.—ఏమీ? కన్యకామతల్లికా! అచ్చటిసంగతులు నీ కేమైనఁ గావలయునా? కావలసినపక్షంబున నడుగుము. నాకు విదితంబులైనవానిని వాకుృిచ్చెద.

పార్వ.—(తనలో) ఈతం డొకవృద్ధుండగు విప్రుండు. ఈతనితో నా విషయము సెప్పినచొ నిరపాయం బగును. (ప్రకాశముగా) పాటు తపసీ! పెద్దలుగదా మీరు? వినుండు.

ఉ. ఎన్నిదినాలనుండియొ మ. హేశుని బ్రేముడిఁ బెండ్లియాడఁగా
నున్నది నామనం, బిచట ♦ నుగ్రతపంబును నాచరింపఁగా
నున్నటువంటికారణము ♦ నూహ మొనర్పగ నద్దె కాన నా
పన్నను నన్నుఁ గావ నల♦పన్నగభూషణుతోడఁ బల్కవే?

బ్రా.—కన్యకాలలామా! ఎంతటికోరిక కోరితివి? ఈలాగున బాల్యంబు తపోమిషంబున బూడిదపాలు నేసినట్లే, యౌవనంబుగూడ నడవిం గాచిన వెన్నెలయట్లు చేయఁదలంచితివా?

పార్వ.—ఏమి దేవా! అట్లు పల్కుచుంటిరి? అజగద్రక్షకుఁ డగు మహేశునితోఁ బొందు తగదనుచున్నారా?

బ్రా.—అగును. ఎందువలననో చెప్పెద నాలకింపుము.

సీ. కుడువ నొక్కింతయుఁ • గూఁడు గానక యెప్డు
  భిక్షమెత్తి భుజించు • పేదవాఁడు
బిచ్చంబునకునైనఁ • బెద్దపాత్రము లేక
  తలపుఱ్ఱ చేతను • దాల్చువాఁడు
ఒడలిని వసనంబు • నొక్కఁడైనను లేక
  పులితోలు పైఁగప్పి • యలరువాఁడు
శృంగారములు లేక • చిలువసొమ్ములు దాల్చి
  పూఁత లేకయు బూదిఁ • బూయువాఁడు
ఉండ నిల్లును లేక • పండ మంచము లేక
  కొండవీఁటం గాఁటఁ • బండువాఁడు
సేవకుల్లేక యా • చెవిటిభృంగీశుతో
  ముసలియెద్దును నెక్కి • మసలువాఁడు

తే. గీ. ఇట్టిసౌభాగ్యవంతుతో • నెట్టు లీవు
  కాపురం బుండి దినములు • గడుపుచుండి
  సౌఖ్య మెంతేని గాంచెదో • సారసాక్షి!
  వలదు వల దెప్డు నీ కిటు • నంటిమగఁడు.

పార్వ.—బాపఁడా! ఎంత మోసగించితివి! నీవేమో మంచివాఁడవని యమ్మేటియైన మహేశునిగుణంబులు వాక్రువ్వుమని వేఁడ నిట్లు నిందింతువే? ఇట్టులు నిందలు సేయుట కాతండు పాత్రుండే? అదియునుంగాక చూడుము.

తే. గీ. ఇట్టిసుఖములు నేరైన • నెన్నినాళ్ళు
  ననుభవించినఁ జివరకు • మనకుఁ దోడ
  వచ్చునే యొక్క పుచ్చిన • వక్కయైన
  కాన నీతుచ్ఛసుఖములు • గాంచ నాకు
  వాంఛయే లేదు సూ యిప్డు • బ్రాహ్మణుండ!

మఱియు—

సీ. కట్టఁ బుట్టములేక ♦ కనుపట్టగా నేమి?
కనకాంబరమువాఁడె ♦ కడు నుతించు
బుస్సుబుస్సనెడుపాములఁ దాలిచిననేమి?
ధననాథుఁ డగువాఁడె ♦ తన్నుఁ గొల్చు
నిద్దంపుదెలిపెద్దయెద్దు నెక్కిన నేమి?
యేనుంగు నెక్కువాఁడే భజించు
నాప్రొద్దు పోయిరాజ ♦ దని యనసేల య
ప్పైశ్వర్యములను దా ♦ ననుభవించు

తే. గీ. ఇట్టు కలిమికి లేమికి ♦ నీశుఁ డగుచు
దునుపనై నను గరుణచే ♦ మనుపనైన
వేలుపులఁ గర్త యాతండె, ♦ వెఱ్ఱివాఁడ!
దూషణము కూడ దది కాదు ♦ భూషణంబు.

వెండియు—

ఉ. పంచశిరంబులం గలుగు ♦ బ్రహ్మను నల్వను జేయలేదె యా
పంచశరంబులం గలుగు ♦ వాని ననంగుని జేయలేదె యా
పంచశిరంబులం బొదలు ♦ భామినికిన్ విమలాంగభూతుఁడై
పంచశిరంబులం గలిగి ♦ భాసిలుశంకరు నెన్నశక్యమే?
ఇంకను నా నీలకంఠుప్రభావంబుఁ గొనియాడ

క. బాణంబై వృషభంబై
ఘోణియునై సాము మేనఁ ♦ గోమలసఖియై
ప్రాణసఖుండై పాద
స్థానమునఁ దృగబ్జ మిడిన ♦ చక్రికి వశమే?

బ్రా.—పిచ్చిదానా! ఎంతమాట పల్కితివి? ఈ సుఖంబులు బుద్బుదంబులవలె నిల్చునవి కావని, యీ లోకంబున సౌఖ్యసాగరంబున నోలలాడక ఇంక నెన్నఁడో వచ్చు పరలోకంబున భద్రంబులు గల్గునని నోరు తెఱచుకొనియుండుట వర్షపాతజలంబునకై వేచియుండుచాతకంబువిధంబుగా దే? ఏల యిట్టిదురాశలు? వలదు, వలదు.

పార్వ.—ఓయీ! వెఱ్ఱిబాపఁడా! నిజమే కాని యీ వర్షంబునకై యాస పెట్టుకొనియుండు వానకోయిలయే చివరకు సుఖం బందుట లేదా? అట్లే యిహలోకసుఖంబుల కాసపడకయుండినఁ బరంబున సుఖింపవచ్చుఁగదా! మఱియు—

తే. గీ. కష్టములఁ గాంచి సుఖములఁ గనఁగవచ్చుఁ
గాని సుఖములఁ గాంచి యీ కష్టములను
భావికాలాన ననుభవింపంగఁగలరె?
దుస్తరంబౌట యెఱుఁగవా? ధూర్తకలుష!

బ్రా.—అట్టినిశ్చయంబుఁ గలదానవేని సంసారసుఖంబుల వదలి నిరశనవ్రతం బూని పర్ణాదులనైన గ్రహింపక అపర్ణవై ఘోర తపం బాచరింపలేక ఇట్లు వివాహంబునకై యాసపడనేల? ఇట్టి వారికి సుఖంబులుగాక పరసుఖంబులు దక్కునే? అదియునుంగాక-

చ. మనమునయందు నెందుఁబర మాత్మనునిల్పియఘంబువాయగా
మననమునల్పుచుండి, తన మానసమందున నన్యసౌఖ్యముల్
కనఁగను వాంఛ వీడి చనఁగాఁ దగువారికి నన్యలోకమం
దున కలుగున్ సమస్తమగు నోములకల్మలు పూవుఁబోఁణిరో!

పార్వ.—అయ్యా! స్వభావసిద్ధంబుగ బుద్ధిమాంద్యంబుగల బాడబత్వం బునకుఁ గీర్తిఁ దెచ్చితివిగదా! (పరిహాసముగా) చూడుము. సర్వ లోకైకనాథుండు ప్రమథగణాధిసేవితుండు నగు నమ్మహేశ్వరుండు గాక ఇతఃపరంబగు ప్రాప్యవస్తువు కలదే? అంతకంటె వేరు పర మాత్ముండు గలండే? నీవే పల్కితివిగదా! ఆమహాత్ముని మననంబు నేసిన మోక్షంబు గల్గునని. ఇన్నాళ్ళనుండియు నేఁగావించుతపం బాతనింగూర్చియేకదా! ఇంక నాపూర్వపుణ్యలేశం బుండిన ఆతనిపొందు చేకూరు. ఇంతకంటె వేరు మోక్షంబు నాకు వలదు. అదియునుంగాక, ముముక్షుల కిహలోకసౌఖ్యంబులు నచింత్యంబు లనికదా నుడివితిరి? ఇఁక నమ్మహాత్మ్ముం డెట్టివాఁడైననేమి? నిశ్చలచిత్తుండవై యాలోచింపుము? ఏతత్కారణంబుననే ఆతనిని వివాహమాడఁ దలంచితిని.

బ్రా.—అట్లైన వివాహసందర్భ మేల? తపంబే చేయరాదా? ఇటువంటి కోరిక లేల?

పార్వ.—ఏలనో తెల్పెద వినుము.

తే. గీ. తల్లిదండ్రులయాజ్ఞను ♦ తలను దాల్చి
వారిసంతోషమునకై వి♦వాహమాడి
యందువలనన పరమాత్మ ♦ నందవచ్చు
ననుకొని తపంబుఁ గావింతు ♦ నందుకొఱకె.

బ్రా.—బాలామణీ! ఇట్టి నీ వచనరచనాచాతుర్యంబునకు నే నేమి మాఱుపల్కఁగలను? నీవు సర్వేశ్వరుండగు కపాలినిగూర్చి చెప్పుమన నామెఱింగినంతవట్టునుఁ దెల్పితి. కాన నాకీ కీలాభీల మేల? నే వెళ్లివచ్చువాఁడ. నీయిచ్చవచ్చినట్లు గావింపుము.

(నిష్క్రమించును.)

పార్వ.—(తనలో) ఏమీ నావచనంబు లింతకటువులుగా నున్నవా! లేకపోయిన నీబాడబుం జేల వెడలును? (అటునిటుచూచి) పిలిపించుదమన్న సఖులుగూడ వచ్చుటలేదే? నేను పోయి ప్రార్థించి తీసికొనివత్తమన్న నాతపస్సమయమైనది. ఏమి సేతు? ఐనఁదిరిగివచ్చుచున్నాఁడో యేమో చూచివచ్చెద. (నలువంకలు పరికించి) ఏఁడీ! ఇంతలో నదృశ్యుఁడైనాఁడే? ఈతం డెవ్వండైన కపట బ్రాహ్మణుండేమో? ఇంతకుఁ దదాగమనకారణం బడుగక పోయితినిగదా? ఈ సంభాషణంబున నంతయు మరచితిని. (తల యూచి) ఇప్పు డేమనుకొనిన నేమిప్రయోజనంబు? దీని కంతకు నేదియో కారణం బుండియుండు. లేకపోయిన నిట్టి యరణ్యంబునకు మత్సఖీజనసాహాయ్యంబున వచ్చుటేమి? ఇ ట్లింతలోఁ దిరోధానం బందు టేమి? ఇట్లెన్నఁడేని జరుగునే? సరే! కానిమ్ము. నాతపోనిష్ఠం గూర్చుండిన నింతయు నా పురాంతకుండె చక్కనేయుగాక.

(కన్నులు మూసికొని ధ్యాననిష్ఠం గూర్చుండును)

(శివుఁడు స్వస్వరూపమునఁ బ్రత్యక్షమగును)

(తెరలో జయజయధ్వనులు)

పార్వ.—(శృతి నభినయించి తనలో) ఈ జయధ్వని యెక్కడిదై యుండును ? ఈ యరణ్యంబున నిట్టి దెప్పుడును గలుగలేదే ! కానఁ గన్నులు దెఱచి చూచెదఁగాక. (కన్నులఁ దెఱచి తేజోమూర్తిని శివుని జూచి పరికాళముగ) నేఁటికి నా జన్మంబు సార్థకంబయ్యె ! (చేతులు జోడించి)

శా. ఓ గంగాధర ! యో గజాసురహరా ! యో గౌరవర్ణాంబరా !
యో గౌరాలక ! యో గజాస్యజనకా ! యోదక్షవిధ్వంసకా !
యో గోపాలక ! యో గుహాఖ్యజనకా ! ఓ పద్మనేత్రాంబకా !
రాగంబారఁగ నేగుదెంచి కనవే ! రక్షింపవే ! పెంపవే !

క. నాలుగు వేదములం గు
ఱ్ఱాలుగఁ బూనిచినభూమి రథ మయ్యుఁ జే
తోలఁగ హరిశరవహ్నిని
బోలులఁ గూలిచిన దేవ ! ప్రోవంగదవే ?

శ్లో. సర్వేశ్వరాయ శర్వాయ సర్వాసురహరాయ చ
నిర్వికారాయ నిత్యాయ పరమేశాయ తే నమః.

క. తొలిపలుకులు నాలుగు నీ
కలరూ పెఱుఁగంగలేక కళవళపడఁగా
బలుకగలవార లెవ రిఁక
నెలనెలతాల్ప ! నను గూర్మి నేలంగదవే.

(పాదములపై వ్రాలును)

శివు.—(లేవఁదీసి) బాలామణీ ! చాలు చాలు సంతసించితిని. నీమృదుమధురస గంధవాక్పుష్పావళి నలంకరింపఁబడితిని. ఇంక నీ తపంబు చాలించుము. నీ మనంబునంగల వాంఛ దీర్చుకొంటివి. మఱియు—

చ. ఎఱుఁగనివాఁడఁగాను, తరళేక్షణ! నీయెద నున్నకోర్కె నే
నెఱుఁగనివాఁడఁగా నిపుడు నెంతయు నీదగు చిత్తనిశ్చయం
బెఱుఁగఁదలంచివచ్చితిని యింతకుమున్ ద్విజవిప్రవేషినై
యెఱుఁగనివాఁడువోలె, భవదీప్సితరాగములం గనుంగొనన్.

పార్వ.—(తలవంచి) స్వామీ! మీరేనా నన్నిన్నివిధాలఁ బరీక్షించితిరి? నాయందు మీకంత యపనమ్మకమా? ఇంత కాలంబు దపంబు గావించిన దెందుల కనుకొంటిరి? అది యట్లుండనిండు.

చం. తెలిసికొనంగలేక భవదీయసురూపవిలాససంపదం
దెలుపు చుటంచు వేశగ, మదీయమనంబునయందు రాగముం
దెలియఁగఁ గోరి నీ వపుడు తేకువతోడను మాటలాడఁగాఁ
దెలియక నిందజేసితిని దీని క్షమింపుము దీనపోషకా!.

(తిరిగి పాదములపైఁ బడును.)

శివు.—(లేవదీసి) బాలా! ఇందులకై యింత ఖిన్నవడుటేల? నన్నుఁ గూర్చి మంచిగనే పల్కితివిగదా? నాకు వ్యతిరేకంబుగ దూషణంబు గావింపలేదుగదా? నా కావిషయ మేదియు మనస్సునందు లేదు. కపటరూపంబున వచ్చుట నాదియే తప్పు. దానికిం దగినట్లు నన్ను నీవచనప్రసూనంబులఁ బూజించి నా మన్ననలఁ బడసితివి. ఇంక భయంబు వీడుము. నేను నీవాఁడనైతిని.

పార్వ.—(సస్మితముగ) ఇది యంతయు నాయదృష్టంబై యున్నది. ఇంతమాత్రంబు తమదయారసలేశంబు నాపై బరపినఁజాలు. ఇంక నాకుం గావలసినదేమున్నది? ఇన్నాళ్లనుండియుఁ దల్లిదండ్రుల వీడి యీవిపినంబునఁ దపంబు గావించిన ఫలంబు నేటికేగాదె దక్కినది. ఇంతకంటె నా కిహపరంబులఁ బ్రాప్యవస్తు వేమి యున్నది?

శివు.—కన్యకామణీ! ఇంకఁ గొలఁదిదినంబులలో నేను అగ్నిసాక్షిగ నీ పితృబంధుమిత్రజనానుమతిని నీకేలు పట్టెద. ఇంక నీవు నీ సఖులం గూడి గృహంబున కేగుము. మిగుల డస్సియున్నదా

నవు. నేను నిదె వెడలుచున్నవాఁడ. (నాలుగడుగులు వేసి వెనుకకు వచ్చి) గిరికన్యకా! నీయువ్యాజప్రేమం బెఱింగితి. నా కొఱకై నీ వేవిధంబైన వెతలం బొందబోకుము. ఇదిగో! వెళ్లు చున్నాను. (తిరోహితుం డగును)

పార్వ.—(తనలో) ఆహా! నేటికి నామనోనాథుండగు శివుండు నావశంబయ్యెఁగదా? ఇంక నాకు భీతి లేదు. అందుచే నింటి కేగి యాపర శివునికై యెదురు చూచుచుండెదగాక. (ఇటునటు చూచి)

అదిగో నా ప్రియసఖులు వచ్చుచున్నారు. వారల కీవార్త నెఱింగింతునా? (ఆలోచించి) ఎఱింగించినందువలన నేమి యపాయము వచ్చును? ఏమియు లేదు. అదియునుంగాక అందువలన నానందంబున నింటికి వెళ్ళవచ్చును.

(చంద్రముఖి పద్మనేత్రిలు ప్రవేశము.)

చంద్ర - పద్మ.—దేవీ! ఇవె పత్రపుష్పఫలాదులు. అందుకొనుము.

పార్వ.—(అందుకొని) చెలులారా! ఒక్క సంతోషకరంబగు వార్తను దెల్పెదను వినుండు.

చంద్ర - పద్మ.—అది యేమో ముందుగాఁ జెప్పుమమ్మా!

పార్వ.—మీరు వెళ్లినతరువాత నే నా బ్రాహ్మణునితో మాట్లాడుచుండఁగనే యాతండు తిరోహితుండయ్యె.

చంద్ర.—ఆతండు కపటబ్రాహ్మణుండేమో! లేకున్న నట్లేల కనుపడకుండఁబోవును?

పద్మ.—చెలియా! ఆతనిఁ జూడఁగనే నిజమైన బాపఁడు కాఁడని తలంచితిని. కాని పెద్దదానవు నీవే యెంతయో వినయవిధేయతలు నూపుచుండ నీకు నేను ప్రతికూల నగుట బాగుగాదని యూరకుంటిని.

చంద్ర.—తరువాత తరువాత?

పార్వ.—అంతటఁ బోనిమ్మని తిరిగి ధ్యాననిశ్చలత్వంబునఁ గన్నులు మొగిడ్చి కూర్చుండఁగనే జయజయధ్వానంబులు శ్రవణపర్వం బుగఁ గోచరంబయ్యె. ఇది యేమియని కన్నులు విప్పి చూచినం తనే యిన్నినాళ్లనుండి యెవరికొఱకై యుగ్రతపం బాచరింపుచుం టినో యెవరిని నామనోహరుండని నమ్మియుంటినో ఆ బాలచంద్ర శేఖరుఁడే నాకు ... (సిగ్గునం దలవంచుకొనును)

పద్మ.—చెప్పుము. చెప్పుము!

చంద్ర.—వెఱ్ఱిదానా! ఇంకను జెప్పవలెనా? ఆమెకు దర్శనం బిచ్చి యుండును. అదిగో! అటు చూడుము. ఆమందస్మితంబులవలననే యది యంతయు గోచరం బగుచున్నది.

పార్వ.—చెలియలారా! ఇంక మనము నిజగృహంబున కేగి సుఖంబుం డుదము రండు. (అందఱు నిష్క్రమింతురు)

---

## 2 వ రంగము.

(హిమవద్వసంతుల ప్రవేశము)

హిమ.—వసంతా! నా యనుంగుగూఁతురు నన్ను వీడి వనంబున కేగి దాదాపొకవత్సరం బగుచున్నది. ఇన్నాళ్లనుండి నామనంబు చింత నొందుచునేయున్నది. నాకు సహధర్మిణియై మేనకయు నెంతయో వంతఁ గుందుచున్నది. కాని నేఁ డేదియో నా చిత్తం బున నానందరసబిందులేశం బొకటి చిందులాడుచున్నది.

వసం.—దేవా! ముద్దులు గుల్కు మీ బాలికారత్నంబునకు వివాహం బగునేమో లెండు.

హిమ.—అంతభాగ్యంబు గూడనా? అప్రాప్తంబగునట్టి యమ్మహేశ్వరు పొందు నందఁగోరితినని ప్రతిజ్ఞనేసి వత్సరంబునుండి తపంబాచరిం చెడిదాని కిం కెక్కడి పాణిగ్రహణము? ఇం కెక్కడిసుఖంబులు?

వసం.—అట్లనకుఁడు. నారదుం డామెతపంబు సిద్ధించునని నుడివెను. అమహాత్మునివాక్యంబు లమోఘంబులుగదా! అట్లైతపోబలంబు విరూపాక్షు సాక్షాత్కరించుకొనునేమో? ఎవ్వరి పురాతనపుణ్యచరిత్రం బెవ్వ రెఱుంగుదురు?

హిమ.—వసంతా! మంచిధారణ గలవాఁడవోయి! ఈ వంతల మునింగియుండుటం జేసి యా ఋషివాక్యంబులే మఱచితిని. నిజముగా నీవేళ నా స్వాంతం బిట్లమందానందకందళితం బగుటకుఁ గూడఁ గారణం బద్దియే యైయుండవచ్చు.

వసం.—దేవా! పర్వతరాజా! నామాటలు వినుండు. నామాటలా కైలాటాలదిండితపసియైన నారదుని భాషణంబులుగ నమ్ముండు. మన పార్వతి కింక దైవానుగ్రహంబున వైవాహికంబు జరుగును. సందియంబు లేదు. అబ్బో! అప్పుడు మా కందఱకుఁ జేతినిండఁ బనులు, నోటినిండఁ బిండివంటలు కాఁబోలు.

హిమ.—నీ పరిహాసంబుల కేమిగాని అటు చూడుము. ద్వారపరిసరంబున నెయ్యదియో సామగానంపుజప్పుడు వినవచ్చుచున్నది! (చెవియొగ్గి విని) అదిగో వినుము.

తే. రామనామామృత స్వాదురసముచేత
మించిమ్రోగెడు మహతిని ♦ మీటుకొంచు
మనకు శుభవార్త చెప్పంగ ♦ మౌనివర్యుఁ
డరుగుదెంచుచు నున్నట్టు ♦ లదిగో! తోఁచె.

వసం.—అగును. నిజమే! దేవరవారు సెలవిచ్చినట్లు దేవమౌని వచ్చుచున్నాఁడు. మహాత్ము లూరకే రారుగదా? వారు సత్కారార్హులుగదా? సత్కరింపుఁడు.

(విష్ణుకీర్తనము సేయుచు నారదుఁడు ప్రవేశించును)

హిమ.—(లేచి వసంతసహితముగ నమస్కరించి) దేవా! ఈభద్రపీఠం బలంకరింపుఁడు. (ఉచితాసనంబుఁ జూపును)

నార.—(కూర్చుండి) హిమవంతా! నీ యాసనంబున నుపవిష్టుండవు కమ్ము.

హిమ.—(కూర్చుండి) మునీంద్రా! నేఁ డెందులకో నామనంబున నొక సమ్మోదలవం బంకురించినది. తమరు త్రిలోకసంచారులు త్రికాల వేదులు నగుటవలనఁ దమకుఁ దెలియనివిషయంబు లేదు. ఇందులకు గతం బెద్దియో నానతీయ సిదే సమస్కారపురస్సరంబుగ వేడుచున్నాను.

నార.—నగేంద్రా! నీ కావిషయంబు సెప్పుటకే వచ్చితి. వినుము.

ఉత్సాహ. నీయనుంగుఁగూతు రపుడు ♦ నిన్ను నీదుప్రేయసిం
దీయనైన పల్కులాడి ♦ తెరువు మెచ్చఁజేసియుం
బోయి కాన కెంతయుం దపోబలంబుతోడఁ దా
నా యహీశవలయు నట్టె ♦ యవతరింపఁజేసియున్.

హిమ.—తరువాత నేమి చేసినది?

నార.—అంతట నామె యాతనిని దన వాక్సుమావళులచేఁ బూజించి మెప్పువడసి యాతనిచేఁ దనకరగ్రహణంబు చేతు నని యనిపించినది. వాగ్దానము చేయించుకొన్నది. ఇంక నీవంతల పీడుము. నీకు భయంబు లేదు.

హిమ.—నా కింక సందియంబు వాసినది. ఋషితిలకా! భవదనుగ్రహంబున సకలమైన యాపదలం గడచితిమి. ఐన నా కుమారి నా నేత్రముల కెప్పు డానందము గల్గించును?

నార.—(ఆలోచించి) ఇదిగో! ఇప్పుడే సఖులంగూడి బైలు దేరినది. చంద్రుం జూచి కలువలు సంతసించు వేళ యగుచున్నది. నీకు నదియ సంతోషకాలంబు. ఇంక నీవు, నీ ప్రేయసి మేనక, శుభలగ్నంబున నామెకు వైవాహికంబుఁ గావింపుఁడు. ఇంతకంటె నేఁ జెప్పవలసిన దేమున్నది? నా జన్మం బిప్పటికి సార్థకతఁ జెందినది. కృతార్థుండ నైతి.

హిమ.—సంతోషము సంతోషము. భవదాజ్ఞాబద్ధుల మగుచున్నాము.

నార.—హిమవంతా! ఇంక నే నేగెద, సుఖంబుండుము.

(లేవఁబోవును.)

హిమ.—స్వామీ! నాయీప్రార్థనం బాలకింపుఁడు.

ఉ. నారద! నీయనుగ్రహముచేఁ దుహితం గనుగొందు, మిప్పుడే
తీరున నామహేశ్వరుని । దేగలవాఁడనొ యానతీయుమో
శారదచంద్రదేహ! యిఁక । జయ్యన నచ్చటి కేగి శంభుతో
మారమణింగుఱించి చెపుమా! యెటులైన గ్రహించునట్లుగన్

నార.—హిమవంతా! తదాగమనంబునకై నీ వేమియు సంశయం బంద నక్కఱలేదు. నే నిప్పుడక్కడికే పోయి యిచ్చటి కరగ్రహణ వృత్తాంతంబుంగూర్చి చెప్పి వచ్చునట్లు నేసెద. అదియునుం గాక యాతండును నీముద్దులకూఁతునం దనురాగంబున నున్న వాఁడు. నీవు లగ్ననిశ్చయంబు చేయించి మహాముని పురస్సరం బుగ వార్త నంపుము. ఆతండు రాఁగలండు.

(తెరలో వైతాళికులు)

తే. గీ. అంబుజాప్తుండు కుంకంగ । నంబుజములు
కుముదమిత్రునియెడలను । గోప మూని
యలుక గాంచినవో యను।నట్లు సంజ
ముడుచుకొని చేసె సాయంబు । ముందుముందె.

(చెవి యొగ్గి విని) అదిగో! సాయంకాలమైనది. వైతాళికులు దెల్పుచున్నారు. ఇంక నే నా కైలాసశైలంబున కేగి పరమేశ్వరుఁ గీర్తించెద.

(నిష్క్రమించును)

హిమ.—వసంతా! ఇప్పుడు మన పార్వతి వచ్చె నని చెప్పెగదా? మనము వెళ్లి యామెను చూతము. రమ్ము.

వసం.—ఐన నింతకుఁ బెండ్లి యెప్పుడు?

హిమ.—రేపటి ప్రొద్దున పెద్దలవలన లగ్ననిశ్చయంబుఁ గావించి వార్తాహరుచేఁ బినాకపాణికి వార్త బంపుదము. పోదము పద.

వసం.—సరే! ఇటు రండు. (ఇద్దఱు నిష్క్రమింతురు.)

---

క. పంకజముఖిగిరితనయా
శంకరవైవాహికప్రశస్తకృతిని, నై
దంకములఁ జతుర్థాంకము
వేంకటకోదండపాణివిరచిత మయ్యెన్.

శ్రీరామచంద్ర గురుపరబ్రహ్మణే నమః.

# శ్రీ పార్వతీపరిణయము.

## పంచమాంకము.

(తాతంభట్టు, వెంకావధానులు ప్రవేశము.)

తాతం.—ఏమయ్యా! వేంకావధాన్లూ! యెక్కడికో బహుతొందరగా బోతున్నావే? రానీవయ్యా నన్నుగూడ? ఏమోకాని పెద్దవాణ్ణి, కాళ్లు బొబ్బలెక్కుతున్నవి. దూరము నడవాలి. ఏం చేయను? వుండవయ్యా! అగు.

వెంకా.—అబ్బా! దబ్బున రాండీ! యీ గాలిపుకాలంలో ఏమసి మొదలెట్టాడో కాని ఆ హిమవంతుడు, ఏమోయింత సంభావనా దానాలు యిస్తాడని వస్తుంటే యీ యెండలకు యీ వడలకు దార్లోనే ప్రాణాలు పోయ్యేట్టున్నాయి. పొట్టకోసం పోవాలి. పోకుంటే యింట్లోదాంతో పళ్లేను?

తాతం.—ఐతే పెండ్లాయేం? యెప్పుడయ్యా? నాతో చెప్పావు కావేం? ముందుగా తెలిస్తే మాబుల్లివాణ్ణికూడ తెచ్చేవాణ్ణి. వాడిక్కూడ ఒడుగైందిలే. పిల్లవాడనా? వాడిక్కూడా యేవో రెండు పనసలొచ్చులే. వాటితో యేవోనాల్గు సంభావనాడబ్బులు వచ్చేవే? యెంత పిచ్చివాడవోయ్. నీకేం పిల్లా? మేకా? లేకపోబట్టి సరిపోయింది. లేకపోయిన నీవూ నావలె గుంజులాడేవాడవే.

వెంకా.—నిజమేనండి. కాని యీసంగతంతా పొద్దోయి భోజనంఅయినానికె తెలిసింది. అప్పుడె పన్నెండైంది. మీకుమాత్రం తెలియకపోతుందా అనుకున్నా? తర్వాత తెల్లవారుఝామున్నే లేచి మొఖం కడుక్కోని అపాళాన బైల్దేరా! ఏంచేసేది?

తాతం.—యింతకు పెండ్లెప్పుడంటే యీపాటంతా పాడ్తావేం? నీకేం వైన పిచ్చెత్తిందావేం?

వెంకా.—సిచ్చా, వెఱ్ఱా? బొత్తిగా పిచ్చివాణ్ణి చేశావే!

తాతం.—మఱేంమాట చెప్పావుకావేం?

వెంకా.—పెండ్లిమాటేకా మీరడిగింది? ఆ. అదైతే రేపే. వుదయం యెనిమిదింటికి మిథునలగ్నం.

తాతం.—యీసాయంకాలానికే పెండ్లికొడుకొచ్చునా యేం? యీపూటేపోయి ఆయన్నాశ్రయించాలి.

వెంకా.—యీపూట వచ్చేది, వారి చుట్టాలు పక్కాలు సిబ్బందీ చూచేవారూ. చెమిటిమల్లయ్యా గుజ్జువెనకయ్య గంగిరెద్దువాహనం పిశాచాలు సిబ్బంది అనుకుంచాను.

తాతం.—యేదైతేయేం. మనచేతు లైల్లబడితే చాలు.

వెంకా.—అదే కావాలిశింది. సరే నడు నడు. పోదాం.

తాతం.—నాకు చాతైనంతగా నడుస్తాను. పద పొద్దుకూకేలోగా చార్లేకపోంలే? ఉండుండు.

[ తెరలో "ఇమాం కన్యామ్ తుభ్య మహం సంప్రదదే" ]

అదే హిమవంతుని మాటలు, పదపద.

(ఇద్దఱు పోదురు)

(ఇది ప్రవేశకము)

---

1 వ రంగము - వివాహగృహము.

(లక్ష్మీనారాయణులును, వాణీహిరణ్యగర్భులును, మేనకాహిమవంతులును, పార్వతీపరమేశ్వరులును, అరుంధతీవశిష్ఠులును, భృత్యులును ప్రవేశింతురు)

హిమ.—పార్వతీ! నేఁడు నిన్ను నీమనోహరుఁడైన పరమేశ్వరునకు నీసుముహూర్తమున నీయగ్నిసాక్షిగ నీయరుంధతీవశిష్ఠులగూాజ్ఞను దానమిచ్చియున్నానుగదా.

(గోక్షీరముల బార్వతిచేయి తాకించి శివునిచేతి కందిచ్చి)

శంకరా!

ఉ. పూతచరిత్ర నిన్నుఁ గని ♦ పొంగు లతాంగిని దీని గొమ్ము నీ
చేతను నుంచి దానమును ♦ జేయుచునుంటిని, నెట్టు లింక నీ
చూతసుమాంగిఁ బార్వతిని ♦ జూచెదొ? యెట్టిదియైన రాగ మీ
వీతలిరాకుఁబోణిపయి ♦ నేర్పడనుంచెదొ? దైవతాగ్రణీ!

మఱియు

చ. వనజదళాయతాక్షి, మృదు♦భాషిణి, పార్వతి దీని నెప్పుడే
పనులను జేయనీయక యు ♦ ప్రాణసమంబుగఁ బెంచినార; మీ
వనయు మనర్హ కార్యముల ♦ నానతియీయక యర్హకార్యమే
యనువునఁ జేయుమాయనుచు♦నానతిసేయుచు నేలు మాలిగా.

వశి.—శివా! శివాధవా! శివకరంబులైన నీశ్వశురవచనంబులు
గైకొమ్ము.

శివు.—వారియాజ్ఞ మా కనుల్లంఘనీయము కదా.

మేన.—(పార్వతీ హస్తము శివుని చేతనుంచి) పినాకపాణీ!

ఉ. ఏవిధమైన మాయ లన ♦ నేమొ యెఱుంగదు, వేరు చేఁతలన్
భావము లేదు, నిన్నరయు ♦ భావమె కాని, యెఱుంగదేమి, నీ
వేవిధమైన ప్రేమిడిని ♦ నీక్షణసేతువా? యెట్టు లేలెదో?
ఈవె సమస్తవేదివగు, ♦ దేనిఁక నేమనఁజెల్ల దీశ్వరా!

అరుం.—పార్వతీపతీ! మీ యత్తగారిమాట లాలింపుము.

శివు.—వింటిని. అట్లే జరుగునుగాక.

నార.—ఆహా! ఎంతటి శుభకరసమాగమంబు ప్రాప్తించినది!

లక్ష్మీనారా.—ఈశుభకరసమాగమ మంతయు నీపార్వతీపరమేశ్వ
రుల తపోబలమువలననే నెరవేరినది కాని వేరు కాదు.

వాణీహిర.—సత్యము. సత్యము.

అరుంధతీవశి.—నిశ్చయము నిశ్చయము.

పార్వ.—నా దేమియు లేదు. అంతయు నమ్మహాదేవానుగ్రహమే?

మేనక.—అమ్మాయీ! పార్వతీ!

సీ. మగనికి నెప్పుడు ♦ మాఱుమాటాడక
వెలయంగ వినయాన ♦ మెలఁగుమమ్మ!
పిన్న పెద్దలయెడఁ ♦ బ్రేమయు భక్తియు
వరుసతోడం గల్గి ♦ తిరుగు మమ్మ!
సతిధర్మముల నరుం♦ధతి వోలె మెలఁగుచు
నమ్మాన్యకీర్తిపై ♦ నలరు మమ్మ
మామీఁది దిగులున ♦ మఱువక యాత్మీయ
ధర్మంబులకు లోటు ♦ దలఁప కమ్మ!

అరుం.—కన్యకామణీ! మీతల్లి పలికినపలుకు లన్నియు రత్నంబులే.

పార్వ.—తల్లీ! అందులకే శిరముపై వహించితిని.

అరుం.—తే. గీ. అత్తవారింట నెంతయుఁ ♦ బొత్తు గల్గి
యుండి కూర్మిబిడ్డల నెంతయుం గడించి
పుట్టినింటికిఁ జాదంబు ♦ బెట్టినింటి
కనవరతము యశమ్మును ♦ ఘనత దెమ్మ!

హిమ.—అమ్మాయీ! మాతృవచనంబులం బోలు నీసాధ్వీబోధను మనంబున ఘనంబుగ నిల్పి వర్తిల్లుము. ఆమీఁద వర్ధిల్లుము. ఇంతకంటెను మేము సెప్పవలసిన దేమున్నది?

నార.—శంకరా! శివంకరా! యింక నీవేమైనఁ బలుకవలసినది కలదా?

శివు.—వశిష్ఠాదు లున్నారుగదా!

వశి.—పార్వతీపతీ! మీ మువ్వేల్పులకంటె నన్నుఁ బెద్దఁజేసి పలుకుమంటివా? ఐన నిట్లగుఁగాక.

## భరతవాక్యము.

చ. నిరతము రాజు లంద అవ♦నీస్థలి స్వస్థతఁ జెందునట్లుగాఁ
గర మనురక్తి నేలుదురు♦గావుత, బ్రాహ్మణు లగ్నిహోత్రముల్

కర మనురక్తి వేల్పొదురుఁగాత, జనంబులు పూర్ణమోదసం
భరితమనస్కులై మనుతఁ బండితవాక్కులు తేజరిల్లుతన్.

అందఱు—తథాస్తు - తథాస్తు - తథాస్తు.

(అందరు నిష్క్రమింతురు.)

---

క. పంకజముఖిగిరితనయా
శంకరవైవాహికప్రశస్తకృతిని నై
దంకములఁ బంచమాంకము
వేంకటకోదండపాణి విరచిత మయ్యెన్.

---